

# చందమామ

## డిసెంబర్ 1987



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 2-50

సంవత్సర చందా: 30-00

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''తండ్రీ-కూతుళ్ళు''] కు ఆధారం, గంగిశెట్టి శివకుమార్ రచన. మనిషి వస్తుతః స్వార్థపరుడు కాదు. అయితే, సామాజిక పరిస్థితుల కారణంగా, మనుషులు విభిన్న మానసిక స్థితులకు గురి అవుతారు. కొందరిలో స్వార్థం పెచ్చు మీరుతుంది. అలాంటివాళ్ళ మనసుల్లో పాపభీతి చోటు చేసుకుంటే జరగబోయేదేమిటో, ''పుణ్యం మార్పిడి'' అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

గిరయో గురవస్తేభ్యోప్యుర్వీ గుర్వీ, తతోపి జగదండమ్,
తస్మాదప్యతిగురవః, ప్రళయేప్యచలా మహాత్మానః.

[పర్వతాలు గొప్పవి; పర్వతాలకన్నా భూమి గొప్పది; భూమి కన్నా విశ్వం గొప్పది. వీటన్నిటికన్నా, ప్రళయమే వచ్చినా చలించకుండా నిలబడగల మహాత్ములే గొప్పవారు!]

సంపుటి 81 డిసెంబర్ '87 సంచిక 6

విడి ప్రతి : 2-50 : : సంవత్సర చందా : 30-00





కామిక్స్ అన్నవి ఇక బోర్ బోర్
రవి అనుకున్నాడు చెయ్యాలనేదో వేరేవేరే
తనంతట తానే సరదా తీరేలా
ఇతరులు చూసి మురిసిపోయేలా
ఆ! ఈ ఎక్కో పెన్నులసెట్ నాకు జోడీ
గీసేస్తా నేనింత కూసే ఓ కోడి
అల్లరి పిల్లల బడి, రెండు బడల జోడి.
నాన్న పెంచే మీసం, అమ్మ చేసే పకోడి.
ఎక్కో పవ్వు ఎక్కోసీలం
ఎరుపు పసుపు నారింజ రంగుల మయం
ఊదా, నలుపు, వైలెట్
గులాబీ, గోధుమలతో అయ్యేనది ఓ సెట్

# ఎక్కో

స్కెచ్ పెన్ రంగులే ఇక రంగులు- సరదాతీర్చే హంగులు!

ప్రిసిషన్ రైటింగ్ పాయింట్స్ (ప్రైవేట్) లిమిటెడ్, 18, సుభాష్ రోడ్, విలే పార్లే (ఈస్ట్), బొంబాయి 400 057.
ఫోన్ : 6040305, 6043556.



## చందమామ కబుర్లు



### అతి ప్రాచీనమైన గుడ్డు

పశ్చిమ కొలొరాడోలో ఇటీవల 145 మిలియన్ సంవత్సరాల నాటి రాక్షసబల్లి (డినోజార్) గుడ్డు పెంకులు బయటపడ్డాయి. ఇదే, ప్రపంచంలోకెల్లా అతి ప్రాచీనమైనదిగా భావించబడుతున్నది. ఆ గుడ్డు పెట్టిన డినోజార్ అవశేషాలకోసం విజ్ఞానవేత్తలు వెదుకుతున్నారు. ఈ పెంకుల కొలతనుబట్టి ఈ గుడ్డు 20 సెం.మీ. పొడవూ, 9 సెం.మీ. అడ్డుకొలతా కలిగి వుండవచ్చని ఊహించబడుతున్నది.

### పసివాడి 'జలజ్ఞానం'!

సౌదీ అరేబియాకు చెందిన హాందన్ అసైరీ అనే పదేళ్ళ కుర్రాడు నేలపొరల అడుగున నీళ్ళు ఎక్కడ ఉన్నదీ ఇట్టే చెప్పగలుగుతున్నాడు. అసైరీ తండ్రి, ఇంటి దగ్గర బావి కోసం నానాతంటాలూ పడుతూంటే, నీళ్ళు ఎక్కడ పడేదీ అసైరీ చెప్పాడు. ఆ తరవాత ఆ కుర్రవాడి సహాయంతో అభా దక్షిణ ప్రాంతంలో ఉంటున్నవాళ్ళు దాదాపు 150 బావులు తవ్వారు.



### సూర్యుడి వయస్సు!

సూర్యగోళానికి దాదాపు 6,000 మిలియన్ సంవత్సరాల వయసు ఉండవచ్చని ఒక అంచనా. కాని, సూర్యుడి వయసు 4,600 మిలియన్ సంవత్సరాలే అంటున్నాడు భారతీయ ఖగోళశాస్త్రజ్ఞుడు బదన్‌వాల్ శ్రీకాంతన్. ఇటీవల మాస్కోలో జరిగిన అంతర్జాతీయ విశ్వకిరణ విజ్ఞానసదస్సులో, ఆయన ఈ విషయం తెలియజేశాడు. అంటే ఈ విజ్ఞానవేత్త ప్రకారం, సూర్యుడి వయసు, ఇంతకు ముందు అనుకుంటూన్న దానికన్నా 1,400 మిలియన్ సంవత్సరాలు తగ్గిందన్నమాట.

### ఒంటికాలితో ప్రపంచప్రదక్షిణ!

రెండవ ప్రపంచయుద్ధంలో ఎడమకాలికి దెబ్బతగలడంవల్ల, ట్రిస్టన్ జోన్స్ అనే సైనికుణ్ణి, సముద్రయానానికి పనికి రాడని — బ్రిటిష్ రాయల్‌నేవీ నుంచి తీసి వేశారు. తరవాత అతని ఎడమకాలు తొలగించారు కూడా. అయినా అతడు ఆ తరవాత గత 34 సంవత్సరాలలో 640,000 కి. మీ. దూరం సముద్రం మీద ప్రయాణం చేసి మూడుసార్లు ప్రపంచాన్ని చుట్టివచ్చాడు.



పురాణగాథలు :

# దుర్గముడు

ఒకానొకప్పుడు దుర్గముడనే రాక్షసుడు మునులను, సజ్జనులను హింసించడానికి నూతన మార్గాలు అన్వేషించసాగాడు. మునులు చేసే యజ్ఞాలకు మూలం వేదాలు. వేదోక్తంగానే యజ్ఞాలు జరుపుతారు. యజ్ఞాలు జరగకుండా చేయాలంటే వేదాలను లేకుండా చేయాలి. అందుచేత దుర్గముడు తపస్సు చేసి అపూర్వశక్తులను సాధించాడు. ఆ శక్తుల ద్వారా మునుల నుంచి వేదాలను దొంగిలించాడు. అంతే కాదు. మునులకూ, ఋషులకూ వేదమంత్రాలు స్ఫురణకు రాకుండా చేశాడు!

ఆ కారణంగా మునులు యజ్ఞయాగాది పుణ్యకార్యాలు చేయలేకపోయారు. యజ్ఞాలూ, ప్రార్థనలూ ఆగిపోయాయి. వారికి జీవితంపట్ల విచారమూ, విరక్తీ పుట్టుకొచ్చాయి. ప్రార్థనలూ క్రతువులూ, లేకపోవడంతో మానవులకూ, దివ్యశక్తులకూ మధ్య సంబంధం తెగిపోయింది. ఋతువుల చక్రం ఆగిపోయింది. సకాలంలో వర్షాలు లేక చెట్టుచేమలు ఎండిపోయాయి. నదులు ఇంకిపోయాయి!

రోజు రోజుకూ బాధలు మితిమించిపోవడంతో, మునులూ, ఋషులూ కలిసి హిమాలయాలకు వెళ్ళి, జగన్మాత దుర్గాదేవిని దర్శించి తమ గోడు విన్నవించారు. వారి బాధలు వినగానే దుర్గామాత నేత్రాలు చెమ్మగిల్లాయి. మరుక్షణమే ఆకాశం మేఘావృతమై, కుండపోతగా వర్షం కురిసింది!

మునులు దుర్గామాతను దర్శిస్తున్నారన్న విషయం తెలియగానే, దుర్గముడు కూడా అక్కడికి చేరాడు. జగన్మాత దివ్యశరీరం నుంచి వేనవేల ఆయుధాలు పుట్టుకొచ్చి, దుర్గముణ్ణి తుదముట్టించాయి.

దుర్గముడి మరణానంతరం వేదాలు మునులకు చేరాయి. యజ్ఞయాగాదివిధులు యథావిధిగా జరిగాయి. లోకం సుభిక్షం అయింది!





# వరమైన శిక్ష

పల్లివాడ అనే గ్రామంలో, చిదంబరం అనే ఒక సామాన్య సంసారి వుండేవాడు. ఆయనకు ఒకే ఒక కుమార్తె, పేరు సౌజన్య. చిన్నతనంలోనే తల్లిని పోగొట్టుకున్న ఆమెను, చిదంబరం ప్రేమతో పెంచి పెద్ద చేశాడు. ఆమె కిప్పుడు పెళ్ళీడు వచ్చింది.

చిదంబరం, కుమార్తె పెళ్లి ప్రయత్నాలు ప్రారంభించాడు. పక్క గ్రామంలోని భూషయ్య అనే పెద్ద వ్యాపారస్థుడి కుమారుడు పెళ్ళి చూపులకు వచ్చాడు. అతడికీ, వెంటవచ్చిన తల్లిదండ్రులకూ సౌజన్య నచ్చింది. అయితే, వాళ్ళు చిదంబరానికి ఏ సంగతీ తేల్చి చెప్పక, నాలుగైదు రోజుల్లో కబురంపుతామని వెళ్ళిపోయారు.

ఆ సాయంత్రం సౌజన్య వంట ప్రయత్నంలో వుండగా, చిదంబరం బజారు నుంచి వచ్చి, "ఈ వచ్చిన సంబంధం మూడుపాళ్ళు కుదిరిపోయినట్టే. ఇకముందు నేనే స్వయంగా వంట చేసుకోకతప్పదు గదా! వంట చేయడం నేర్పు, తల్లీ!" అన్నాడు నవ్వుతూ.

అంతలో అక్కడికి, చిదంబరం స్నేహితుడు నాగభూషణం వచ్చి, "ఇదుగో, చిదంబరం! అమ్మాయి పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నావు గదా! మా బంధువుల ఇంటికి రాజారాం అనే కుర్రాడు వచ్చాడు. అందగాడు, చురుకైనవాడు. రేపు ఉదయానే వెళ్ళిపోతాడట. ఇప్పుడే అతనికి సౌజన్యను చూపిద్దాం," అన్నాడు.

అందుకు చిదంబరం, "పొద్దున ఒకరు వచ్చి సౌజన్యను చూసి వెళ్ళారు. వాళ్ళు ఏ సంగతీ చెప్పకముందే, మరొక సంబంధం చూడడం బావుంటుందా?" అన్నాడు.

మాచిరాజు కామేశ్వరరావు



''ఆ వచ్చినవాళ్ళు, తమకు పిల్ల నచ్చింది, సరేనంటే వేరేమాట. అలా కానప్పుడు మరొక సంబంధం గురించి ఆలోచించడంలో తప్పేముంది?'' అని అడిగాడు నాగభూషణం విసుగ్గా.

చిదంబరం, నీ యిష్టం అన్నట్టు తల వూపి వూరుకున్నాడు. కొద్దిసేపట్లో నాగభూషణం, రాజారాంను వెంటబెట్టుకు వచ్చాడు.

ఒక పావుగంటకాలం, ఆ మాటా, యీ మాటా మాట్లాడుకున్న తరవాత రాజారాం, ''నాకు ఎవరూ లేరు. ఉన్న ఆస్తి ఒక చిన్న యిల్లూ, దాని చుట్టూ వున్న పెద్ద స్థలం. అక్కడ నేను రకరకాల కూరగాయలు పండించి అమ్ముతూం టాను. నాలుగు గేదెలున్నవి. వాటి పాలు పట్నంలో వ్యాపారం చేసే, ఒకతను వచ్చి కొనుక్కుపోతూంటాడు. ఈ వచ్చే ఆదా యంతో, పెళ్ళాం పిల్లల్ని పోషించగల నన్న నమ్మకం వున్నది,'' అన్నాడు నవ్వుతూ.

తర్వాత, అక్కడి నుంచి వెళ్ళేముందు రాజారాం, చిదంబరంతో, ''మీ అమ్మాయి ఎవరికైనా నచ్చుతుంది. అందువల్ల, నాకు నచ్చిందని చెప్పడం లేదు. ఆమెకు అభ్యంతరం లేకపోతేసరి. మీరు బాగా ఆలోచించుకుని, నాకు కబురు పంపండి,'' అన్నాడు.

సౌజన్యకు, రాజారాం నచ్చాడు. అది గ్రహించిన చిదంబరం, ''కుర్రవాడు అందగాడు. మంచి మాట కలుపుగోలు తనం వున్నవాడిలా కనిపిస్తున్నాడు. అయితే, పొద్దున వచ్చిన పెళ్ళి సంబంధం వాళ్ళు, బాగా ఆస్తిపరులు,'' అన్నాడు.

సౌజన్య విని వూరుకున్నది. మర్నాటి ఉదయం చిదంబరం, కుమార్తెతో, ''నేను భూషయ్య వాళ్ళ ఊరు వెళ్ళి, వాళ్ళేం నిర్ణయానికి వచ్చారో తెలుసుకుని వస్తాను. రాజారాంకు మనం ఏదో ఒకటి తేల్చి చెప్పాలి గదా!'' అని బాడుగబండిలో వెళ్ళిపోయాడు.



తండ్రి వెళ్ళిన కొద్దిసేపటికి, సౌజన్య వీధి తలుపు మూయబోతూండగా, ఒక కొత్తవాడు, "ఇది చిదంబరంగారి ఇల్లేనా?" అని ఆమె నడిగాడు.

"అవును. ఆయన ఇంట్లో లేరు. ఏం పని?" అని అడిగింది సౌజన్య.

అందుకు, ఆ వచ్చినవాడు, "నా పేరు శంకరయ్య. మాది రామాపురం. మా ఊరి రాజారాంకు, చిదంబరంగారు తన కుమార్తె నివ్వబోతున్నాడట. ఆ రాజారాం దొంగతనం నేరం మీద, రెండేళ్ళు కారాగారంలో వుండి వచ్చాడు. ఈ సంగతి, ఆయన చెవిని వేసి వెళదాం అని వచ్చాను," అని చెప్పి, గబగబా వెళ్ళిపోయాడు.

ఇది విన్న సౌజన్యకు నెత్తిన పిడుగు పడినట్లయింది. ఇందులో వున్న నిజం ఎంతో స్వయంగా తెలుసుకోదలచి, ఆమె ఇంటికి తాళం వేసి, బాడుగబండిలో రామాపురం వెళ్ళింది.

అక్కడ రాజారాం ఇల్లు తెలుసుకోవడం, సౌజన్యకు ఏమంత కష్టం కాలేదు. రాజారాం, ఆమెను చూసి చిన్నగా నవ్వి, "ఇలా హఠాత్తుగా వచ్చావేం?" అని అడిగాడు.

సౌజన్య కొంచెం కోపంగా, "మీ గురించి, యింతకుముందే ఒక సంగతి విన్నాను. మీరు దొంగతనం నేరానికిగాను, కారాగారానికి వెళ్ళినమాట నిజమా? అబద్ధమా?" అని అడిగింది.

రాజారాం వెంటనే జవాబు చెప్పకుండా, సౌజన్యను ఇంటి నడవాలోకి తీసుకుపోయి, అక్కడ వున్న ఒక కుర్చీ చూపి కూర్చోమని చెప్పి, "నువ్వు చాలా కోపంలో వున్నట్టున్నావు! అసలు నేను కారాగారంలోకి వెళ్ళిన కారణం ఏమిటో చెబుతాను, శాంతంగా విను," అంటూ యిలా చెప్పాడు:

చిన్నతనంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకున్న రాజారాం, అవ్వ సంరక్షణలో పెరిగాడు. అవ్వ గారాబం అతణ్ణి



బాగా చెడిపింది. చదువు అబ్బలేదు. ఇరవైఏళ్ళు వచ్చినా, బతుకుతెరువుకు ఏ పనీ నేర్చుకోలేదు. అవ్వను పీడించి డబ్బు తీసుకుని, దాన్ని పట్నంలో ఎడా పెడా ఖర్చుపెట్టి, ఇల్లు చేరుతూండేవాడు.

ఇలా ఒకసారి రాజారాం, బాడుగ బండిలో పట్నం వెళుతూండగా, దారిలో ఒక నడివయసుస్త్రీ బండిని ఆపింది. ఆమె చేతిలో ఒక డబ్బా వున్నది.

"పట్నం వెళుతున్నావా, బాబూ?" అని ఆమె, రాజారాంను అడిగింది.

"అవును," అన్నాడు రాజారాం.

"అయితే, ఒక చిన్న సాయం చేయి, బాబూ! పట్నంలో, నా కొడుకు చదువుకుంటున్నాడు. వాడికోసం సున్నిఉండలు చేసి, ఈ డబ్బాలో వుంచాను. వాడి నాన్నకు ఒంట్లో బాగా లేదు. లేకపోతే ఆయనే తీసుకుపోయేవాడు," అని, ఆ స్త్రీ రాజారాంకు డబ్బా యిచ్చి, పట్నం మొదట్లో వున్న రామాలయం దగ్గిర, దాని కోసం ఎదురుచూసే నారాయణ అనే అతడికి యివ్వమన్నది.

రాజారాం ఎక్కిన బండి రామాలయాన్ని సమీపించగానే, ఇద్దరు రక్షకభటులు బండిని ఆపారు. రాజారాం వాళ్ళతో, "మీరెందుకోసం బండిని ఆపారో తెలియదు. నా దగ్గిర, యీ సున్నిఉండల డబ్బా తప్ప మరేం లేదు," అన్నాడు, డబ్బా వాళ్ళకు చూపుతూ.

రక్షకభటులు డబ్బా మూత తీసి, సున్ని ఉండలను బయటికి తీశారు. వాళ్ళకు వాటి అడుగున బంగారునగలు కనిపించినై.

వాళ్ళు వెంటనే రాజారాం మెడపట్టుకుని, "మేం యిక్కడ కాపలా వేసింది సున్నిఉండలకోసం కాదు; ఈ దొంగ నగలకోసం! పద, కొత్వాలు దగ్గిరకు," అని రాజారాంను బండిలో నుంచి కిందికి లాగారు. ఇది గమనించిన అసలు దొంగ, అక్కడి నుంచి చల్లగా జారుకున్నాడు.

ఈ విధంగా, చెయ్యని నేరానికి రాజారాంకు రెండేళ్ళ కారాగారశిక్ష

పడింది. ఇది విన్న అతడి అవ్వ దిగులుతో మంచంపట్టి, వారంరోజుల్లో మరణించింది.

రాజారాం, సౌజన్యకు జరిగిన వాస్తవం చెప్పి, ''కారాగారంలో వున్న, ఆ రెండేళ్లూ, నేను కూరగాయల పెంపకంలోని మెళుకువలన్నీ తెలుసుకున్నాను. విడుదల అయ్యాక అదే నాకు జీవనాధారం అయ్యింది,'' అన్నాడు.

''ఈ రెండేళ్ల కారాగారవాసం గురించి, నువ్వే స్వయంగా చెప్పివుంటే బావుండేది గదా!'' అన్నది సౌజన్య.

రాజారాం నవ్వి, ''ఇదేం ఘనకార్యం కాదుగదా! అయినా, ఇది మీకు తెలియాలనే, మా పూరువాణ్ణి, మీ ఇంటికి పంపాను,'' అన్నాడు.

అన్ని అనుమానాలూ తీరిన సౌజన్య, తన తొందరపాటుకు రాజారాంకు క్షమాపణ చెప్పి, ఇంటికి తిరిగి వచ్చింది.

ఆ సరికే ఇల్లు చేరిన చిదంబరం, ''ఎక్కడికి వెళ్ళావు? రాజారాం దొంగట. ఆ సంబంధం సంగతి మరిచిపో. పొద్దున వచ్చిన భూషయ్య కొడుక్కు, నువ్వు బాగా నచ్చావు. అయితే, పాతికవేలు కట్నం అడుగుతున్నారు. వాళ్ళ అంతస్థుకు లక్ష యిచ్చినా తక్కువే. ఇల్లు అమ్మకం పెడతాను,'' అన్నాడు.

''అవసరం లేదు, నాన్నా! ఎంతో ఆస్తి వుండి కూడా కట్నం అడిగే, ఆ భూషయ్య లాంటివాళ్ళే నిజమైన దొంగలు. నేను రాజారాం ద్వారా అంతా తెలుసుకున్నాను. అతడు నిర్దోషి. ఏమైనా శిక్ష అనుభవించడంవల్ల, అతడికి మేలే జరిగింది. బయట వున్నట్టయితే, ఏ పనీపాటూ చేయకుండా, ఉన్న కొద్దిపాటి ఆస్తినీ ఖర్చుపెట్టేసేవాడు. రెండేళ్ళ శిక్ష అనుభవించిన కాలంలో, ఒళ్ళొంచి పని చేయడంనేర్చుకుని ప్రయోజకుడయ్యాడు. ఒక విధంగా, ఆ శిక్ష అతడి పాలిట వరమైంది. నేను రాజారాంనే చేసుకుంటాను,'' అన్నది సౌజన్య.

చిదంబరానికి, కూతురు నిర్ణయం చాలా సంతోషం కలిగించింది.





# ఉద్యోగప్రయత్నం

ధనగుప్తుడు శ్రీపురంలో, పెద్ద రత్నాల వ్యాపారి. ఆయన దగ్గిర శ్రీధరుడనేవాడు వ్యాపారానికి సంబంధించిన లెక్కలు రాస్తూండేవాడు. శ్రీధరుడి చాకచక్యం వల్లా, తెలివితేటలవల్లా, ధనగుప్తుడికి వ్యాపారంలో మంచి లాభాలు వస్తూండేవి. అయితే, ధనగుప్తుడు, శ్రీధరుడి సహాయానికి గుర్తింపుగా, ఏనాడూ అతడి నెల జీతం పెంచలేదు.

శ్రీధరుడికివచ్చే జీతం, అతడి కుటుంబ పోషణకు సరిపోయినప్పటికీ, భార్యాబిడ్డల చిన్న, చిన్న కోరికలు తీర్చడానికి నానా తంటాలూ పడేవాడు. శ్రీధరుడు, తనయజమాని ఏదో ఒకనాడు జీతం పెంచుతాడని ఎంతోకాలం ఎదురుచూశాడు. కాని, అలాజరగక పోయేసరికి, మరొక రత్నాల వర్తకుడివద్ద, అధిక వేతనం మీద ఉద్యోగం కోసం ప్రయత్నించసాగాడు.

కోమలపురం రత్నాల వ్యాపారి అనంతగుప్తుడు, శ్రీధరుణ్ణి వ్యాపారానికి సంబంధించిన అనేక ప్రశ్నలడిగి, అతడిచ్చిన జవాబులకు సంతృప్తిపడ్డాడు. ఆయన, శ్రీధరుడికి ఉద్యోగం యివ్వదలచుకుని, ముందుగా అతడి యజమాని ధనగుప్తుణ్ణి కలుసుకున్నాడు.

అనంతగుప్తుడు, శ్రీధరుడి పనితనం, నిజాయితీ గురించి అడిగినమీదట, ధనగుప్తుడు, శ్రీధరుడు మంచి తెలివైనవాడేకాక, చాలా నమ్మకస్థుడని చెప్పి, "అతడి చాకచక్యం కారణంగానే, నేను వ్యాపారాన్ని బాగా అభివృద్ధి చేయగలిగాను," అన్నాడు.

ఇది విన్న తర్వాత, అనంతగుప్తుడు, శ్రీధరుడికి కబురు చేసి పనిలో చేరమన్నాడు. అయితే, ఆయన యిస్తానన్న నెలసరిజీతం, ధనగుప్తుడిచ్చే దానికన్న

రాంబాబు

తక్కువ కావడంతో, శ్రీధరుడు ఆయన వద్ద పనికి కుదరలేదు.

శ్రీధరుడు, యీసారి కామాక్షిపురం లోని, చంద్రగుప్తుడు అనే రత్నాల వ్యాపారి దగ్గిరకుపోయాడు. చంద్రగుప్తుడు కూడా, శ్రీధరుణ్ణి వ్యాపారానికి సంబంధించిన అనేక విషయాలను గురించి ప్రశ్నించి, అతడిచ్చిన జవాబులకు తృప్తి చెందాడు.




ఆయన, శ్రీధరుణ్ణి తగనాత రమ్మని చెప్పి, శ్రీపురం వెళ్ళి ధనగుప్తుణ్ణి కలుసుకుని, శ్రీధరుణ్ణి గురించిన వివరాలు వాకబుచేశాడు.

ధనగుప్తుడు, ఆయనకు లోగడ అనంతగుప్తుడికి చెప్పినట్టే చెప్పి, "శ్రీధరుడు తనకున్న శక్తిసామర్ధ్యాలవల్ల, ఏదో ఒక నాడు తప్పకుండా సొంతంగానే రత్నాల వ్యాపారం ప్రారంభించవచ్చు," అన్నాడు నవ్వుతూ.

చంద్రగుప్తుడు, శ్రీధరుణ్ణి పిలిపించి ఉద్యోగంలో చేరమన్నాడు. అయితే, ఆయన యిస్తానన్న జీతం, ధనగుప్తుడు యిచ్చేదానికన్న నాలుగు వరహాలు ఎక్కువ. కామాక్షిపురం శ్రీధరుడి సొంత ఊరుకు చాలాదూరం. ఆ కారణంవల్ల, చంద్రగుప్తుడిదగ్గిర ఉద్యోగం లాభసాటి కాదని, శ్రీధరుడు పనిలో చేరలేదు.

మూడవ ప్రయత్నంలో, శ్రీధరుడికి, శ్రీపురానికి పక్కనే వున్న ధర్మపురినుంచి, విశాసదత్తుడు అనే వర్తకుడివద్ద పనికి పిలుపు వచ్చింది. శ్రీధరుడిచ్చిన జవాబులకు విశాసదత్తుడు తృప్తిచెంది, అతణ్ణి పంపివేసి, అమర్నాడు ధనగుప్తుణ్ణి చూడబోయి, శ్రీధరుణ్ణి గురించి వివరాలు అడిగాడు.

అందుకు ధనగుప్తుడు నవ్వి, "శ్రీధరుడు పరమబద్ధకస్థుడు. మతిమరుపు మనిషి కూడా. అతణ్ణి పనిలో పెట్టుకున్నందువల్ల, యింతవరకూ వ్యాపారంలో చాలా నష్టపోయాను. ఇదంతా, మీరడిగారు కాబట్టి చెపుతున్నాను," అన్నాడు.

"నిజం చెప్పి, నాకు చాలా మేలు చేశారు!" అని విశాసదత్తుడు వెళ్ళి పోయాడు.

ఈ సంభాషణ అంతా, దుకాణం లోపలి గదిలో వుండి విన్న శ్రీధరుడు చాలా బాధపడిపోతూ, ధనగుప్తుడితో, "అయ్యా, నాగురించి చెడుగా చెప్పి, వచ్చిన మంచి అవకాశాన్ని పోగొట్టారు. ఇలా ఎందుకు చేశారో అర్థం కావడం లేదు," అన్నాడు.

ధనగుప్తుడు, శ్రీధరుడి భుజంతట్టి, "ఇంతకుముందు నువ్వు యిద్దరు వర్తకుల వద్ద పనికి ప్రయత్నించావు. వాళ్ళు, నీకివ్వదలచిన జీతం, నేనిచ్చేదానికన్న పెద్ద ఎక్కువేంకాదు. ఈ సంగతులన్నీ, నేను యితరత్రా విచారించి ఎప్పటికప్పుడు రహస్యంగా తెలుసుకుంటూనే వున్నాను. అయితే, యీ విశాసదత్తుడు, నేనిచ్చే దానికన్న ఎక్కువ జీతం యివ్వడానికి సిద్ధంగా వున్నాడు," అన్నాడు చిన్నగా నవ్వుతూ.

"అయితే, నామీద ఆయనకు లేని పోనివి చెప్పి, నాకు కీడెందుకు చేశారు?" అని అడిగాడు శ్రీధరుడు.

దానికి ధనగుప్తుడు, "శ్రీధరా, నువ్వు, నాదగ్గిర పనిలో చేరిననాటినుంచి నా మేలు కోరుతున్నట్టే, నేనూ నీమేలు కోరుతున్నాను. నువ్వు పిల్లలు గలవాడివి. నేను మరికొంత జీతం ఎక్కువ యిచ్చినా, దాన్నీ ఖర్చుచేయడం తప్ప, మిగుల్చుకో లేవు. ఏది అవసరం అయిన ఖర్చో, ఏది దుబారాగా అయే ఖర్చో గ్రహించడం చాలా కష్టం. నీ పెద్దకూతురు పెళ్ళికి ఎదిగొస్తున్నది. అందుకుగాను కొంత డబ్బు, నీపేర దాస్తున్నాను. అంతేగాక, యీ నెలనుంచి విశాసదత్తుడు నీకివ్వ దలచిన జీతం నేనే యిస్తాను. సరా?" అన్నాడు.

ఇంతకాలంగా, తన యజమానిని తప్పుగా అర్థం చేసుకున్నందుకు శ్రీధరుడు బాధపడుతూ, ధనగుప్తుడికి తన కృతజ్ఞత చెప్పుకున్నాడు.






## 2

[బంగారులోయ రాజ్యంలో భూకంపంవల్ల కోటకొమ్ము విరిగి నేలకూలింది. రాజు ఆ కోటను నిర్మించిన వాస్తుశిల్పి మనమద్రైన వినోదుడికి జైలుశిక్ష విధించాడు. అతడు పట్టుపడకుండా అరణ్యం చేరాడు. అక్కడ అతడు ఒక బంగారు స్త్రీ విగ్రహాన్ని చూశాడు. జలపాతానికి వెనక ఉన్న గుహలో ప్రవేశించమని, అతణ్ణి ఒక కంఠస్వరం హెచ్చరించింది. తరవాత—]

జలపాతం వెనక వున్న గుహలో ప్రవేశించి అక్కడి దేవతను వరం కోరమని హెచ్చరించిన కంఠస్వరం వినగానే, వినోదుడికి పట్టరాని ఆనందం కలిగింది. అయితే, ఆ కంఠస్వరం చెప్పిన జలపాతం దాటి, దాని వెనక వున్న గుహ ద్వారంకుండా అవలికి వెళ్ళినవాళ్ళెవరూ, యింతవరకు తిరిగి రాలేదు. కాని, వినోదుడికి తనను హెచ్చరించిన, ఆ కంఠస్వరం సత్యం పలికిందన్న దృఢమైన నమ్మకం కలిగింది.

అయితే, తను విగ్రహ రక్షణకు ఎవరి సాయమైనా కోరాలన్న ఆలోచన కలిగింది, వినోదుడికి. కొంత ఆలోచించిన మీదట, మహారాజు కన్న అందుకు తగినవాళ్ళు మరెవరూ లేరని నిర్ణయించుకున్నాడు.

ఆ సరికి తూర్పు తెల్లనవుతున్నది. వినోదుడు మరొకసారి బంగారు విగ్రహం

మనోజ్ దాస్



కేసి చూశాడు. ఆ విగ్రహం పెదాల మీద చిరునవ్వు కదిలినట్టు అతడికి అనుభూతి కలిగింది.

వినోదుడు, కోట కేసి బయలుదేరాడు. సూర్యోదయం అయిందన్న సూచనగా, కోట ద్వారరక్షకులు అప్పుడే బాకాలు ఊదారు. వినోదుడు వాళ్ళను సమీపించి, "నేను వెంటనే మహారాజుగారిని దర్శించాలి!" అన్నాడు.

"మహారాజుగారిని దర్శిస్తావా? తమరు చక్రవర్తులా ఏమిటి కోరగానే ఆయన దర్శనం యివ్వడానికి? తెల్లవారిందన్న హెచ్చరికగా బాకాలూది, మా విధి మేము నిర్వహించాం. ఇక ఆయనను నిద్రలేపేందుకు, పడకగదిగవాక్షం ఎత్తు వరకూ తన కిరణాలను ప్రసరించడం, సూర్యుడిపని," అన్నారు ద్వారరక్షకులు.

వినోదుడు మారుమాట్లాడకుండా, వాళ్ళను తప్పుకుని కోట ద్వారం దాటాడు.

"ఆగు!" అంటూ కోట రక్షకులు పెద్దగా బొబ్బరిస్తూ, వినోదుణ్ణి ఆపి చూశారు. కాని, అతడి ముఖం చూస్తూనే బెదిరిపోయినవాళ్ళలా పక్కలకు తప్పుకున్నారు. ఇందుకు కారణం వాళ్ళకు అర్థం కాలేదు.

వినోదుడికి కూడా యిది వింతగా కనిపించింది. అతడు అక్కడ కనిపించిన సేవకుణ్ణి మహారాజుగారి పడకగది ఎక్కడ అని అడిగితే, అప్పుడే సూర్యకిరణాలు ప్రసరిస్తున్న గదినొకదానిని అతడికి చూపించాడు.

వినోదుడు దాన్ని సమీపించి, "మహారాజా, తక్షణం నిద్రలేవండి! తమ కొక గొప్ప శుభవార్త చెప్పదలిచాను," అంటూ పెద్దగా కేకపెట్టాడు.

ఆ కేక విన్న రాజసేవకు డొకడు, వినోదుడిపై కోపగించుకుని, "మహారాజుగారి కెన్నో బిరుదనామాలున్నవి. కనీసం వాటిలో—చండమార్తాండ అన్న బిరుదుతోనైనా వారిని సంబోధించు," అన్నాడు పళ్ళుకొరుకుతూ.



వినోదుడు వాడి మాటలు పట్టించుకోకుండా, "హేఁ, మహారాజా!" అంటూ మరింత బిగ్గరగా కేకపెట్టాడు.

మహారాజు ఆ కేకకు అదిరిపడి, పడక మీది నుంచి లేచి, తెరిచివున్న కిటికీ దగ్గిరకు వచ్చాడు. ఇది గమనిస్తూనే భటులుకొందరు స్తంభాలచాటుకూ, గోడల పక్కకూ తప్పుకున్నారు. మహారాజు, ఆ కుర్రవాడితోపాటు, తమనూ కఠినంగా శిక్షిస్తాడన్న భయం వాళ్ళకు కలిగింది.

మహారాజు కిటికీ దగ్గిర పళ్ళుకొరుకుతూ కొంచెంసేపు నిలబడ్డాడు. తర్వాత, హఠాత్తుగా ముఖకవళికల్లో మార్పు వచ్చింది. ఆయన పెద్దగొంతుతో, "ఎవర్రా అక్కడ? ఆ వచ్చిన కుర్రవాణ్ణి, యిక్కడికి పంపండి," అంటూ ఆజ్ఞయిచ్చాడు.

వినోదుడు పరుగునపోయి, మహారాజు పడకగదిని చేరాడు. వాళ్ళిద్దరూ ఏం మాట్లాడుకున్నారో ఎవరికీ అంతుపట్టలేదు. అయితే, మహారాజు హడావిడిగా మెట్లు దిగాడు.

అక్కడ వున్న భటులకూ, రాజసేవకులకూ, వినోదుణ్ణి సరిగా చూసి గుర్తుపట్టడం అప్పుడే సాధ్యపడింది. వాళ్ళల్లో చాలామంది వినోదుణ్ణి ఎరుగుదురు. అతడి సాహసవర్తన మహారాజుతోపాటు, అందరినీ విభ్రాంతులను చేసింది.

మంత్రుల్లో ఒకడు అప్పుడే, ఆ ప్రదేశానికి వచ్చి, జరిగింది తెలుసుకుని, మహారాజుతో, "కాని....చండమార్తాండ మహారాజా...." అంటూ ఏదో చెప్పబోయాడు.

అయితే, మహారాజు విసుగ్గా, "ఒరే చచ్చువెధవల్లారా, నోరుమూసుకుని నా వెంట రండి!" అంటూ అరిచాడు.

ఆ సమయానికింకా, మహారాజుగారి గుర్రం నిద్రలేవలేదు. ఆలస్యాన్ని సహించలేని మహారాజు, వినోదుడు దారితీయగా, అతడి వెనకగా నడవసాగాడు.

వినోదుడు, ఆయన్ని, "మహారాజా, తమరు అప్పుడప్పుడూ అరణ్యానికి వినోద



యాత్ర ఎందుకు చేయకూడదు?'' అని అడిగాడు.

''ఒరే, మతిలేని కుర్రవెధవా, నేనెందుకు అరణ్యం ప్రవేశించాలి? మహారాజులుండవలసింది మేడల్లో, అరణ్యాల్లో కాదు,'' అన్నాడు మహారాజు.

''అరణ్య వృక్షాలకింద పరుగులు తీస్తూ, సెలయేటి నీళ్ళను మీద జల్లుకుంటూ అలా స్వేచ్ఛగా తిరగడంలో ఎంత ఆనందం వుంది!'' అన్నాడు వినోదుడు.

''స్వేచ్ఛా! నేను ఎవరి స్వేచ్ఛనైనా హరించగలను. అంతకన్న నాకు కావలసిన స్వేచ్ఛ ఏమున్నది! సరే, కుర్రాడా నిజం చెప్పు. అసలు అరణ్యంలోకి వెళ్ళాలన్న ఆలోచన, నీకెందుకు కలిగింది?'' అని మహారాజు వినోదుణ్ణి ప్రశ్నించాడు.

''అరణ్యంలోకి వెళ్ళకపోతే, ఆ బంగారు విగ్రహం, నాకంట ఎలా పడేది? అదుగో, చూడండి!'' అంటూ వినోదుడు, కొద్దిదూరంలో వున్న విగ్రహాన్ని మహారాజుకు చూపించాడు.

మహారాజు రెండు చేతులనూ నడుం మీద పెట్టుకుని, బంగారు విగ్రహం కేసి చూడసాగాడు. అతడి ముఖకవళికల్లో కోపం, అంతలోనే వెకిలినవ్వూ కదలాడినై. ఆయన, వినోదుడి కేసి తల తిప్పి, ''ఒరే, నాతో వేళాకోళం ఆడుతున్నావా? నువ్వు చెప్పినచోట, నిలువుగా బండరాళ్ళు తప్ప, నాకేమీ కనిపించడం లేదు,'' అన్నాడు.

ఆ ప్రశ్నకు వినోదుడు ఆశ్చర్యపోయి, ''చండమార్తాండ మహారాజా! సూర్యకాంతిలో మిలమిల మెరిసిపోతున్న బంగారు విగ్రహం తమకు కనిపించడం లేదా? ఆశ్చర్యంగా వున్నది,'' అన్నాడు.

''కనబడడం లేదు! కనబడడం లేదు!'' అన్నాడు రాజు ఉగ్రుడైపోతూ.

''మహారాజా, అలా ఎందుకు జరిగింది?'' అన్నాడు వినోదుడు అర్థం కాక.

“ఎందుకు జరిగిందంటే—అసలక్కడ విగ్రహం లేదు కనక. ఒరే, అడవి గుడ్లగూబ వెధవా! అసలు నన్ను నిద్ర

ఎందుకు లేపావు? ఆ సమయంలో నేను పెళ్లికొడుకుగా అలంకరింపబడుతున్నట్టు కలగంటున్నాను. నీకు చావు తప్పదు!'' అంటూ హుంకరించాడు మహారాజు.

వినోదుడు ఏమాత్రం భయపడక, ''మీరు చాలాసార్లు పెళ్ళికొడుకయ్యారు; మీరు చంపింది కూడా ఏమంత తక్కువ మందిని కాదు,'' అన్నాడు.

కాని, మహారాజు, యీ మాటలేవీ వినే స్థితిలో లేడు. ఆయన గట్టిగా నేలను తన్ని, ''పడకగది నుంచి బయలుదేరి నప్పుడు, ఆ హడావిడిలో ఒక్కొక్క కాలికి ఒక రకం చెప్పు తొడుక్కున్నాను. మహారాజైనవాడు నిద్రలేస్తూనే ప్రప్రథమంగా చేయవలసింది, దువ్వెనతో చక్కగా మీసాలు దువ్వుకోవడం—ఆ పనీ మరిచాను,'' అన్నాడు.

వినోదుడు నివ్వెరపడి మహారాజు కేసి చూడసాగాడు. మహారాజు ముంచెత్తుకు వస్తున్న దుఃఖాన్ని ఆపే ప్రయత్నంలో పెద్దగా అరిచాడు. ఆ అరుపుకు రాళ్లగుట్టల చాటు నక్కలు బిగ్గరగా ఊళలు పెట్టినై.

ఈ కేకలూ, గగ్గోలూ విన్న ప్రధాన మంత్రీ, మహాజ్ఞానుల సభలోని ఐదుగురు సభ్యులూ, మహారాజు కేదో ప్రమాదం జరిగిందన్న శంకతో, అక్కడికి పరుగు, పరుగున వచ్చారు.



రాజు, వాళ్ళకేసి కళ్ళురుముతూ చూసేంతలో, మహాజ్ఞానుల్లో ఒకడు, ''మహారాజా!'' అన్నాడు బొంగురు పోయిన గొంతుతో.

మరొకడు, ఆదుర్దాపడిపోతూ, ''చండ మార్తాండప్రభో!'' అన్నాడు కీచుకంఠంతో.

ఆ వచ్చిన ఐదుగురిలో, ఏ ఒక్కడికీ జరిగిందేమిటో అంతుపట్టలేదు. ఒక కుర్ర కుంక భవనానికి వచ్చి పిలిస్తే, తమ రాజంతవాడు, వాడి వెంటపడి, ఈ శిథిలాలకు ఎందుకు వచ్చినట్టు?

అంతలో రాజు గట్టిగా తుమ్మాడు. మహాజ్ఞానులు ఐదుగురూ కంపించి పోతూ, ఆయన కేసి చూశారు.



అప్పుడు రాజు కనుబొమలు ముడిచి వాళ్ళ కేసి చూస్తూ, "ఈ ప్రాతఃకాలపు పవనాలున్నవే, యివి అతి ప్రశస్తమైన, నాబోటి రాజ. వంశీకుడికి హానికరమని, నా దృఢవిశ్వాసం!" అని, వినోదుణ్ణి వేలెత్తి చూపుతూ, "ఈ కుర్ర వెధవ నన్ను ఆటపట్టిస్తున్నాడు;" అన్నాడు.

వినోదుడు, "ఆటపట్టించడమా?" అంటూ ఆశ్చర్యపోయి, మహాజ్ఞానులతో, "అయ్యా, రాజుగారికి మీరైనా చెప్పండి. మీ అందరికీ, అదిగో, అక్కడ బంగారు విగ్రహం కనిపిస్తున్నది గదా," అన్నాడు.

ఐదుగురు జ్ఞానులూ, ఆతృతగా వినోదుడు చెప్పిన దిక్కు కేసి చూశారు.

"నువ్వు చెప్పేచోట, ఒక గుడ్లగూబ నా కంటికి కనబడుతున్నది," అన్నాడు మంత్రి.

"గుడ్లగూబా! అదేంకాదు. అక్కడ ఒక పెద్ద సాలెపురుగు కనిపిస్తున్నది. అంత లావుపాటి సాలెపురుగును, నా జన్మలో యింతవరకు చూడలేదు," అన్నాడు మహాజ్ఞానుల్లో ఒకడు.

వినోదుడు విసుగ్గా, "ఎంతోకాలం కిందట, కొండరాళ్ళ చాటున పడిపోయిన బంగారు విగ్రహం, యిప్పుడు బయటికి వచ్చింది. అది మీకు కనిపించడం లేదా?" అని అడిగాడు.

"ఏమిటీ? కొన్నివేల సంవత్సరాల కిందట, భూకంపంవల్ల కొండరాళ్ళ చాటున కప్పబడిపోయిన బంగారు విగ్రహం, అక్కడ వున్నదా? వీడికి పూర్తిగా బుద్ధి పెడతలపట్టింది!" అన్నాడొక మహాజ్ఞాని.

మహాజ్ఞానులందరూ, అవునన్నట్టు తలలూపారు. ముంచుకొస్తున్న కోపంతో, ఈ సంభాషణ అంతా వింటున్న రాజు గట్టిగా చప్పట్లుచరిచి, "ఈ అబద్ధాల కోరును పట్టుకుని, కింద వున్న అగాధంలోకి విసిరివేయండి!" అన్నాడు.

వినోదుడు, రాజాజ్ఞ వింటూనే దూరంగా వెళ్ళబోయాడు. అంతలో రాజు, అతడి

కుడిచేయి వడిసిపట్టుకున్నాడు. మంత్రి అతడి ఎడమచేతిని పట్టుకున్నాడు. మిగతా వాళ్ళలో యిద్దరు వినోదుడి కాళ్ళనూ, మరొకడు కంఠాన్నీ పట్టుకున్నారు.

అందరూ కలిసి, అతణ్ణి అగాధం కేసి ఎత్తుకుపోతున్నంతలో, బంగారు విగ్రహం వున్న వైపునుంచి, శ్రావ్యమైన రాగాలాపన వినబడింది.

మహాజ్ఞానుల్లో ఒకడు, ''అద్భుతం! అద్భుతం!'' అన్నాడు, వినోదుడి కాలి పట్టును వదులుతూ.

రాజు కోపంగా, ''ఆగు! ఆ అద్భుతం సంగతి ముందుగా చెప్పవలసినవాణ్ణి, నేను! ఆ రాగాలాపన పంచదార లడ్డు అంత మధురంగా వున్నది. ఒక లడ్డు ఏమిటి? వందలు, వేలు!'' అన్నాడు.

అందరికీ యిప్పుడు బంగారు విగ్రహం స్పష్టంగా కనబడుతున్నది. వాళ్ళు వినోదుణ్ణి వదిలి, విగ్రహం కేసి చూడసాగారు. మహాజ్ఞానుల్లో, ఒకడు, ''చండమార్తాండ, ప్రభో! ఆ విగ్రహం అందాన్ని ఇంద్రధనుస్సుతో సరిపోల్చవచ్చు.'' అన్నాడు.

రాజు, వినోదుడి చేయివదిలి, ''ఒరే, కుర్రాడా, ఏమా విగ్రహ సౌందర్యం! నేను, నిన్ను తాకినందువల్లనే, నా కంటికి ఆ బంగారు విగ్రహం గోచరించింది. నిన్ను మెచ్చి తీరవలసిందే!'' అంటూ వినోదుణ్ణి కావిలించుకున్నాడు.

వినోదుడు సంతోషంగా, ''చండమార్తాండ, మహారాజా! ఆ విగ్రహం కళ్ళబడగానే, మీరెంత సౌందర్యవంతులుగా మారిపోయారో తెలుసా?'' అన్నాడు.

''అలాగా! ఎక్కడ రోజూ నేను ముఖం చూసుకునే దర్పణం! అద్దం!'' అంటూ కీచుమని, రాజు మహాజ్ఞానులతో, ''మీలో ఒకరు వెంటనే కోటకుపోయి, అద్దం తీసుకురాగలరా?'' అన్నాడు.

అయితే, వాళ్ళెవరూ రాజు మాటలు వినేస్థితిలో లేరు. అందరూ బంగారు విగ్రహం కేసి చూస్తూ తన్మయత్వంలో వున్నారు. —(ఇంకావుంది)






# తండ్రీ-కూతుళ్ళు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, అర్ధరాత్రివేళ, భీతికొలిపే ఈ శ్మశానంలో నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే, నీ మీద ఎవరో తగు కారణం లేకుండా ద్వేషం పూని, నిన్నీపనికి పురిగొల్పినట్టు నాకు అనుమానం కలుగుతున్నది. ఒక్కొక్కసారి స్నేహితులమధ్యా, ఆత్మబంధువులమధ్యా సంబంధాలు విలక్షణంగా తయారవడం జరుగుతూంటుంది. ఇందుకు ఉదాహరణగా, కన్నతండ్రి మీదే అకారణంగా ద్వేషం పెంచుకున్న, ఒక కుమార్తె కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ యిలా చెప్పసాగాడు :

## బేతాళ కథలు



ఒకప్పుడు చంద్రగిరిని, విష్ణుగోపుడనే రాజు పరిపాలిస్తూండేవాడు. అయనకు ఒక్కగానొక్క కొడుకు రామగోపుడు. విష్ణుగోపుడు వృద్ధుడైపోయాక విశ్రాంతి తీసుకోదలచి, రామగోపుడికి పట్టం కట్టాడు.

రామగోపుడు విద్యావంతుడు, గుణవంతుడు, చాలా అందమైనవాడు. ఎంతో ఉదారస్వభావం కలవాడు కూడా. ఒకసారి అతడు వేటనిమిత్తం తన పరివారంతో బయలుదేరి, అరణ్యంలో చాలా దూరం ప్రయాణం చేసి దాదాపు తమ చంద్రగిరి రాజ్యపు సరిహద్దులను చేరుకున్నాడు.

అక్కడ కంటబడిన ప్రకృతి దృశ్యాలు, రామగోపుడికి ఎంతో అహ్లాదం కలిగించాయి. ఒక ఎత్తయిన కొండ. దాని దిగువున ప్రవహిస్తున్న నది. ఆ చుట్టుపక్కల పచ్చని పైర్లతో కలకలలాడుతున్న గ్రామాలు.

రామగోపుడు విచారించగా తెలిసినదేమంటే, ఆ కొండప్రాంతం గానీ, చుట్టూ వున్న గ్రామాలు గానీ చంద్రగిరి రాజ్యంలోనివి కావు. ఆ ప్రాంతమంతా పొరుగున వున్న నాగపురి రాజ్యంలోనిది. ఈ సంగతి తెలిశాక రామగోపుడు చాలా విచారపడ్డాడు. అంత అందమైన ప్రదేశం, తన ఏలుబడిలో లేనందుకు విచారిస్తున్న అతడి మనసులో, ఒక అలోచన ప్రారంభమై, రాజధాని నగరం చేరేసరికి, ఒక గట్టి నిర్ణయంగా మారింది.

వారం రోజుల తర్వాత, రామగోపుడు సైన్యాన్ని సమీకరించి, నాగపురి మీద దాడి చేశాడు. ఊహించని విధంగా, ఈ సైనిక దాడి రావడంతో నాగపురి రాజు రామగోపుణ్ణి సమర్థవంతంగా ఎదిరించలేకపోయాడు.

రామగోపుడు యుద్ధంలో విజయుడై, తాను కోరిన ప్రాంతాలను ఆక్రమించుకుని, సంతోషంగా నగరానికి తిరిగి వెళ్ళాడు.



ఓటమి కారణంగా నాగపురి రాజు శశినాగుడు మనోవ్యధకు గురయ్యాడు. ఆయన మంత్రులతో, యిప్పుడేమి చేయాలన్న విషయం గురించి సంప్రదింపులు ప్రారంభించాడు.

వాళ్ళు, రాజుతో, "ప్రభూ, ప్రస్తుత సమయంలో, చంద్రగిరి రాజు సైనికంగా మనకన్న బలవంతుడు. మనం మరింతగా సైనికబలాన్ని సమకూర్చుకుంటే గాని, అతడి మీదికి యుద్ధానికి వెళ్ళలేము," అన్నారు.

శశినాగుడు, సైనికబలాన్ని పెంచేందుకు తక్షణం తగిన ఏర్పాట్లు చేయవలసిందిగా, తన మంత్రులనూ, సేనాధిపతినీ ఆజ్ఞాపించాడు.

కొంతకాలం గడిచింది. శశినాగుడికి, అవంతి అనే పేరు గల అందాలరాశి అయిన కూతురున్నది. ఆమెకు యుక్త వయసు వచ్చింది. ఆమె జాతకం ప్రకారం, ఆమెకు ఆ సంవత్సరమే వివాహం చేయడం మంచిదని పురోహితులు, రాజుకు సూచించారు. ఆ రాజవంశంలో, రాకుమార్తెల వివాహం స్వయంవర పద్ధతిలో జరగడం ఆచారం.

శశినాగుడు స్వయంవరానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేయసాగాడు. ఆహ్వాన పత్రికలు సిద్ధం అయాక, రాజోద్యోగులు కొందరు శశినాగుడికి, ఆ పత్రికలను చూపించారు.

శశినాగుడు ఎవరెవరికి ఆహ్వానాలు వెళుతున్నాయో చూసి, "చంద్రగిరి రాజు రామగోపుడికి ఆహ్వానపత్రిక లేదేం?" అన్నాడు.

ఆ ప్రశ్నకు ఉద్యోగులు ఆశ్చర్యపోయి, అప్పటికప్పుడు రామగోపుడి పేరు మీద ఆహ్వానపత్రిక రాసి, పంపారు. స్వయంవరం రోజు రానేవచ్చింది. రాకుమారులందరూ బారులు తీర్చి కూర్చున్నారు. రామగోపుడు కూడా స్వయంవరానికి రావడం, అందరికీ ఎంతో ఆశ్చర్యం కలిగించింది.

రాకుమారి అవంతి చేతిలో పుష్ప హారంతో మెల్లగా ముందుకు నడుస్తూం డగా, పక్కన వున్న ఆమె యిష్టసఖి, ఒక్కొక్క రాకుమారుని గుణగణాలూ, వారియొక్క సిరిసంపదలూ, పరాక్రమ విశేషాలూ గురించి వివరంగా చెప్పుకు పోతున్నది.

రాకుమార్తె, ఆ మాటలు మౌనంగా వింటూ, చివరకు చంద్రగిరి రాజు రామ గోపుడి దగ్గరకు వచ్చి, అతడి మెడలో పుష్పహారం వేసింది.

అది చూసి ఒకటి, రెండు క్షణాలు అక్కడ వున్న వాళ్ళందరూ నిశ్చేష్టులై పోయారు. రాకుమార్తె యిలా ఎందుకు చేసింది? ఆమెకు మతిస్థిమితం తప్ప లేదు కద! పగవాడు, అందులోనూ విపరీతమైన రాజ్యకాంక్ష వున్నవాణ్ణి భర్తగా వరించడంలో, ఆమె ఉద్దేశ్యం ఏమిటి? అని, అందరూ తర్కించడం మొదలుపెట్టారు.

అయితే, రాజు శశినాగుడు మాత్రం యివేమీ పట్టించుకోకుండా, సింహాస నందిగి వచ్చి, రామగోపుడితో, అవంతి వివాహం జరిపించాడు. తర్వాత, అల్లుడికి యథోచితమైన మర్యాదలన్నీ జరిపి, విలువైన కానుకలిచ్చి, కూతుర్నీ, అల్లుణ్ణీ సాగనంపాడు.

ఐదారు నెలలు గడిచాక, శశినాగుడు, మంత్రులనూ, దండనాయకులనూ పిలిచి, ''ఇప్పుడు మనకు సైనికబలం



తగినంతగా సమకూడిందా?'' అని ప్రశ్నించాడు.

''సైనికబలం ఎందుకు, ప్రభూ?'' అని అడిగారు మంత్రులు అర్థం కాక.

''ఎందుకేమిటి? చంద్రగిరి రాజ్యం మీద దాడి చేసి, మనం లోగడ పోగొట్టు కున్న ప్రాంతాలను జయించడానికి,'' అన్నాడు శశినాగుడు.

మంత్రులూ, దండనాయకులూ మారు మాట్లాడకుండా, సైనికసమీకరణ ప్రారం భించారు. ఈ సంగతి వేగులద్వారా విన్న రామగోపుడు, తాను లోగడ ఆక్రమించిన నాగపురిరాజ్య ప్రాంతాల నుంచి, తన సైనికులను ఉపసంహరిస్తున్నట్టు, మామకు వార్తపంపాడు.

ఇందుకు రాజు శశినాగుడు చాలా సంతోషించాడు. తమ రాజ్యం పోగొట్టు కున్న ప్రాంతాలు, తిరిగి రాజ్యంలో కలిసి నందుకు ప్రజలు అనందోత్సవాలు చేసు కున్నారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, శత్రురాజును, తన కుమార్తె స్వయం వరానికి ఆహ్వానించడంలో, శశినాగుడి ఉద్దేశం ఏమిటి? అతన్ని ఆహ్వానించడం వల్ల, రాజుకు కొరివితో తల గోక్కున్నట్ట యింది కదా! రాకుమారి అవంతి, స్వయంవరానికి వచ్చిన అంతమంది రాకుమారుల్లో, ఎవరూ తగరన్నట్టు, తండ్రి శత్రువునే వరించడం, కన్న తండ్రిపట్ల ద్వేషభావం కనబరచడమే గదా?



జరిగిందేదో జరిగిపోయిందని పూరుకోక, శశినాగుడు, అల్లుడి మీద యుద్ధానికి ఆయత్తం కావడంలోని అంతర్యమేమిటి? తాను లోగడ జయించిన పొరుగురాజ్య ప్రాంతాలను, ఎటువంటి ప్రతిఘటనా లేకుండా, రామగోపుడు ఏ కారణం వల్ల వదులుకున్నాడు? అతడు, తన మామకు వున్న సైనికబలాన్ని చూసి భయపడ్డాడా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''స్వయంవర పద్ధతిలో వున్న విశేషమేమంటే, ఏ రాజ కుమారి అయినా, తనకు యిష్టమైనవాణ్ణి వివాహమాడడం. అందువల్ల, శశినాగుడు మిత్ర, శత్రుభేదాలు పాటించి, కొందరికి ఆహ్వానాలు పంపకపోతే, వరనిర్ణయం రాకుమార్తెది కాక, అతడి దవుతుంది. ఇది గుర్తించినందువల్లనే, శశినాగుడు, రామగోపుడికి ఆహ్వానం పంపాడు. స్వయంవర సంప్రదాయానికి భంగం కలగకుండా, తన తండ్రి ప్రవర్తించిన తీరు అర్థం చేసుకున్న అవంతి, తనకు అన్నివిధాలా యిష్టుడైనవాడి మెడలో పుష్పహారం వేసింది. అంతేకాని, తండ్రిపట్ల ద్వేషం వల్లకాదు. ఇక, రాజుగా తను కోల్పోయిన రాజ్యభాగాన్ని తిరిగి జయించడం, శశినాగుడి బాధ్యత. అలా చేయకపోతే, బంధుప్రీతికొద్దీ, తమ రాజు దేశప్రయోజనాలను మంటగలిపాడన్న నింద వస్తుంది. రామగోపుడు తాను ఆక్రమించిన ప్రాంతాన్ని, ఏ ప్రతిఘటనా లేకుండా విడిచిపోవడం భయంవల్ల కాదు. తన మామగారి తదనంతరం, అతడు ఎలాగూ చంద్రగిరి—నాగపురి రాజ్యాలు రెంటికీ రాజు కాగలడు. అలాంటప్పుడు పట్టుదలకుపోయి, యుద్ధం చేసి జననష్టం కలిగించడం మంచిది కాదనుకున్నాడు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






శేషయ్య మధ్యతరగతి గృహస్థు. ఏదైనా మంచిపుస్తకంచదువుతున్నప్పుడు, ఆయన పరిసరాలను మరిచిపోతాడు. అలాంటి సమయంలో, ఎవరైనా పిలిస్తే, ఆయనకు ఎక్కడలేని చిరాకు.

ఒకనాటి ఉదయం, ఆయన పుస్తక పఠనంలో లీనమై వున్నాడు. ఆ సమయంలో వంటగదిలో వున్న భార్య, "ఏమండీ, పిల్లాణ్ణి కాస్త చూడండి!" అన్నది.

శేషయ్య కొడుక్కు మూడేళ్ళు. వాడి పేరు బాబు. శేషయ్య వాడి ముందు కొన్ని ఆటబొమ్మలు పడేశాడు. దానితో వాడు, తండ్రిని విసిగించకుండా ఆడుకోసాగాడు. శేషయ్య హాయిగా పుస్తకం చదువుకుంటున్నాడు.

ఆ సమయంలో బయట వాతావరణం చల్లగా, ఆహ్లాదకరంగా వున్నది. ఆకాశంలో కారు మబ్బులు గుమిగూడుతున్నాయి. హఠాత్తుగా ఒక మెరుపు మెరిసి, వెంటనే ఒక ఉరుమురిమింది.

ఆటలాడుకుంటున్న బాబు, ఆ ఉరుము చప్పుడుకు హడిలిపోయి, గుక్కపట్టి ఏడుపు మొదలుపెట్టాడు. వాడి ఏడుపు విని కంగారుపడి, వంటపని ఆపి పరుగున వచ్చింది, శేషయ్య భార్య లక్ష్మి. ఆమె ఎంత సముదాయించినా, వాడు ఏడుపు మానలేదు.

"ఉరుము చప్పుడుకు, పిల్లాడు జడుసుకున్నాడు. వెధవ ఉరుము!" అంటూ శేషయ్య ఉరుమును తిట్ట సాగాడు. అయినా, పుస్తకం మాత్రం, ఆయన చేతిలోనే వుంది.

లక్ష్మి, బాబు ఏడుపును మాన్పలేక విసిగిపోయి, భర్తతో, "మీరా పుస్తకాన్ని కాసేపు పక్కనపెట్టి, బాబును పెరట్లోకి

తీసుకుపోయి అడించండి, ఊరు కుంటాడు. ఈలోగా నేను వంటపని పూర్తి చేస్తాను,'' అన్నది.

శేషయ్య చేసేదిలేక, బాబును పెరట్లోకి తీసుకుపోయాడు. అక్కడ వాడు ఉన్నట్టుండి ఏడుపునాపి, ''నాన్నా! పువ్వు! పువ్వు,'' అంటూ చప్పట్లు చరిచాడు.

శేషయ్య వాడు చూస్తున్న వైపుకు దృష్టి మరల్చాడు. అప్పుడే విరిసిన అందమైన చెంగల్వపూవులను చూసి, బాబు చప్పట్లు కొడుతున్నాడని, ఆయన గ్రహించాడు.

శేషయ్య, భార్యను, ''ఏమేవ్, యిలారా!'' అంటూ పెద్దగా కేకవేసి పిలిచాడు.

లక్ష్మి పెరట్లోకి వస్తూ, ''ఏమిటండీ, హడావుడి?'' అన్నది.

శేషయ్య, భార్యకు బాగా విచ్చుకున్న చెంగల్వ పువ్వులను చూపుతూ, ''ఇంత వరకూ లేని యీ పువ్వులు, హఠాత్తుగా ఎక్కడినుంచి ఊడిపడ్డాయి?'' అని అడిగాడు.

లక్ష్మి పువ్వులకేసి చూసి, ''చెంగల్వ పువ్వులా! ఇప్పుడే గదా, ఆకాశం ఉరిమింది. ఆ ఉరుముకు విచ్చుకుని వుంటాయి;'' అని ఇంట్లోకి వెళ్ళిపోయింది.

శేషయ్య, బాబుకేసీ, చెంగల్వ పువ్వుల కేసీ చూస్తూ, అమితాశ్చర్యంతో అలా నిలబడిపోయాడు.

పెనుగాలులతో, మెరుపులతో, ఉరుము లతో భూమ్యాకాశాలను దద్దరిల్లజేసే ప్రకృతి, ఒక్కొక్కసారి మందహాసం చేస్తూ లాలించగలదు కూడా!

బాబును భయపెట్టినందుకు, ఉరుమును తిట్టుకోవాలో, ఆ బాబునే సంతోష పెట్టే చెంగల్వ పువ్వులను వికసింపజేసి నందుకు, ఉరుమును మెచ్చుకోవాలో, శేషయ్యకు తెలియలేదు. కాని, ఆయన కూడా చిన్నపిల్లవాడిలా, ఆ అందమైన పువ్వుల కేసి చూస్తూ, ఎంతగానో ఆనం దించసాగాడు.



పిల్లలకు చందమామ నిర్వహిస్తున్న పోటీలో సరదాగా పాల్గొనండి!

# మహోన్నత భారతీయ సంస్కృతి పోటీ

## బంపర్ సెక్షన్

### బంపర్ ప్రైజులు గెలుచుకోండి!

ప్రథమ బంపర్ : 10,000 రూపాయలు స్కాలర్‌షిప్ *

ద్వితీయ బంపర్ : 5,000 రూపాయలు స్కాలర్‌షిప్ *

తృతీయ బంపర్ : 2,500 రూపాయలు స్కాలర్‌షిప్ *

* ఐదేళ్ళవరకు ఐదు సమానవాయిదాలలో

220 కన్సొలేషన్ బహుమతులు : 1988 ఏప్రిల్ మొదలు ఒక యేడాదిపాటు చందమామకు ఉచిత చందా

## పాల్గొనడం ఎలా?

ఇక్కడి ప్రశ్నలకు సమాధానాలన్నీ 1987 సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్, డిసెంబర్ చందమామ సంచికలలో
లభిస్తాయి. ఈ నాలుగు సంచికలనూ సేకరించి, సమాధానాలకోసం పరిశీలనగా చూడండి.
పక్కన ఆరు చిత్రపటాలూ, వాటి కింద ప్రశ్నలూ ఇవ్వబడ్డాయి. నిర్దిష్ట స్థలంలో, స్పష్టమైన దస్తూరీతో సమా
ధానాలు రాయండి.
తరవాత, పక్క పేజీలో ఉన్న—"భారతదేశం మహోన్నతమైన సంస్కృతిని కలిగి ఉన్నది. దానిని తెలుసుకోవ
డానికి చందమామ చదవడమే ఉత్తమ మార్గం. ఎందుకంటే..........." అన్న వాక్యాన్ని పూర్తి చేయండి. ఈ
వాక్యం పదిహేను మాటలకు మించకూడదు. ఉత్సాహకరమైన చక్కటి సమాధానం రాయండి.
అన్నిటికీ సరైన సమాధానాలు రాసి, ఉత్తమంగా వాక్యాన్ని పూర్తిచేసినవారే బహుమతి విజేతలుగా ఎంపిక చేయ
బడతారన్న విషయం గుర్తుంచుకోండి.
మీ పేరూ, వయసూ, చిరునామా రాసి, ఎంట్రీఫారం మీద నిర్దిష్ట స్థలంలో పోటీ 1, 2, 3 కూపన్లను అతికించి,
పేజీని కత్తిరించి ఎంట్రీఫారాన్ని పోస్టు ద్వారా మాకు పంపండి.

## పోటీ నిబంధనలు:

- 16 సంవత్సరాల వయసుకు లోబడిన పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు. ఒకరు ఎన్ని ఎంట్రీలనైనా
పంపవచ్చు. అయితే, అవి చందమామలో అచ్చయిన ఎంట్రీఫారాలలో మాత్రమే పంపాలి.
- ఎంట్రీఫారాలను, స్పష్టమైన దస్తూరీలో, చందమామ ప్రచురింపబడుతూన్న పదకొండు భాషలలో ఏ భాషలో
నైనాసరే పూర్తిచేసి పంపవచ్చు.
- బంపర్ సెక్షన్ ఎంట్రీఫారాలు జనవరి 31, 1988 లోగా మాకు చేరాలి.
- ఎంట్రీలు ఆలస్యంగా అందినా, పోయినా, పాడయినా నిర్వాహకులు బాధ్యత వహించరు.
- ఎంట్రీలను మామూలు పోస్టు ద్వారా మాత్రమే పంపాలి.
- చందమామ పబ్లికేషన్స్ ఉద్యోగులూ, హిందూస్థాన్ థాంప్సన్ అసోసియేట్స్ ఉద్యోగులూ, వారి కుటుంబ
సభ్యులూ తప్ప తక్కిన భారతీయ పౌరులందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
- ఎంట్రీలను పరిశీలించి, ఎన్నికచేయడంలో న్యాయనిర్ణేతల మండలిదే తుదినిర్ణయం. ఈ విషయంగా ఎటు
వంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
- విజేతలకు వ్యక్తిగతంగా పోస్టులో తెలియజేయబడుతుంది. వారి పేర్లు చందమామలో
ప్రకటించబడతాయి.

ముఖ్య గమనిక :
పంపే అన్ని
బంపర్ సెక్షన్ ప్రైజులకోసం
ఎంట్రీలలోను చందమామ సెప్టెంబర్, అక్టోబర్, నవం
బర్ సంచికలలో ముద్రింపబడిన చందమామ పోటీ,
1, 2, 3 బంపర్ సెక్షన్ లేబిల్స్ అతికించబడి ఉండాలి.
మూడు లేబిల్స్‌నూ కత్తిరించి, నిర్దిష్ట స్థలాలలో
అతికించండి. లేబిల్స్ లేని ఎంట్రీలు పోటీకి
అంగీకరింపబడవు.

# బంపర్ సెక్షన్

## (ఎంట్రీఫారం)

క్రింది ప్రశ్నలకు బాక్సులలో ఇవ్వబడిన చిత్రపటాలకు కింద స్పష్టమైన దస్తూరీలో సమాధానాలు రాయండి.



బావిలో పడినపిమ్మట జ్ఞానం పొంది మునీశ్వరుడుగా కీర్తిగాంచిన ఈ పసివాడు ఎవరు?

నిశాకరుడు



రాకుమారి కళ్యాణలతిక తండ్రిని ఓడించి, ఆమెను పెళ్ళాడతానని శపథం చేసిన ఈ యువరాజు పేరేమిటి?



భారతదేశంలోని ఏ పురాతన నగరంలో ఈ లక్ష్మీ నరసింహ విగ్రహం ఉన్నది?



తంత్రం చేసి పిశాచం గద్దిచెక్కాను కాజేసిన ఈ జపాను కుర్రవాడెవడు?



తన శక్తిని గురించి ఈ రాజు డంబాలు పలుకుతున్నాడు. ఈయన పేరేమిటి?



తనను పొగడుతూ కవిత్వం చెప్పలేదన్న కారణంగా బ్రహ్మరాక్షసుడి ఆగ్రహానికి గురైన ఈ యువకవి ఎవరు?

సెప్టెంబర్ సంచికలోని చందమామ పోటీ-1 లేబిల్ ఇక్కడ అతికించండి

అక్టోబర్ సంచికలోని చందమామ పోటీ-2 లేబిల్ ఇక్కడ అతికించండి

నవంబర్ సంచికలోని చందమామ పోటీ-3 లేబిల్ ఇక్కడ అతికించండి

# బంపర్ సెక్షన్

## (ఎంట్రీఫారం)

ఇప్పుడు, "ఎందుకంటే......" తరవాత వాక్యాన్ని పూర్తి చేయండి. ఈ వాక్యం పదిహేను మాటలకు మించకూడదు.

భారతదేశం మహోన్నతమైన సంస్కృతిని కలిగి ఉన్నది. దానిని తెలుసుకోవడానికి 'చందమామ' చదవడమే ఉత్తమ మార్గం. ఎందుకంటే.....................

..............................................................................

..............................................................................

..............................................................................

పేరు: ..............................................................................

వయసు .............................. చిరునామా ..............................

..............................................................................

..............................................................................

ఈ పేజీని కత్తిరించి మీ ఎంట్రీఫారాన్ని వెంటనే ఈ చిరునామాకు పోస్టు చేయండి:

**చందమామ పోటీ బంపర్ సెక్షన్**
చందమామ పబ్లికేషన్స్
188, ఆర్కాట్ రోడ్
మద్రాసు-600 026

ఎంట్రీఫారాలు మాకు చేరవలసిన ఆఖరు తేది: జనవరి 31, 1988

మనదేశపు అద్భుతాలు :

# కొచ్చిన్ ఆలయాలు

భారతదేశచరిత్ర, వివిధ ఘట్టాలలోనూ కేరళలోని కొచ్చిన్ ప్రాంతాన్ని ప్రభావితం చేసింది. ప్రపంచంలో ప్రాచీనమైన యూదుల స్థావరం ఒకటి ఇక్కడే వెలసింది. ప్రస్తుతం వున్న యూదుల ప్రార్థన ఆలయం శతాబ్దాల చరిత్రకలది. నీలం, తెలుపు చీనా పెంకులతో దీని కప్పు వేయబడి ఉన్నది.






ప్రప్రథమంగా, వాస్కోడాగామా నాయకత్వంలో పోర్చుగీసువారు, కళ్ళికోట ద్వారా ఇక్కడికి వచ్చారు. వాస్కోడా గామా ఇక్కడివాళ్ళ మీద హింసాత్మక చర్యలకు పూనుకున్నాడు.

భారతదేశంలో ఐరోపావాళ్ళ మొట్ట మొదటి క్రైస్తవ ఆలయం ఇక్కడి సెయింట్ ఫ్రాన్సిస్ చర్చ్. ఇది పోర్చు గీసు వారి పాలనలో కేథలిక్ చర్చి గానూ, డచ్ వారి పాలనలో ప్రొటస్టెంట్ చర్చిగానూ, బ్రిటిష్ హయాంలో ఆంగ్లికన్ చర్చ్‌గానూ వుండేది. ప్రస్తుతం ఇది చర్చ్ ఆఫ్ సౌత్ ఇండియా ఆధ్వర్యం కింద పనిచేస్తున్నది.





16 వ శతాబ్దంలో పోర్చుగీసువారు ఇక్కడ డచ్ భవనాన్ని నిర్మించి కొచ్చిన్ రాజవంశీయులకు కానుకగా ఇచ్చారు. దీని గోడల మీద రామాయణ ఘట్టాలు కొన్ని చిత్రింపబడి ఉన్నాయి.

సోలమన్‌రాజు వర్తక నావలలో, యూదులు ఇక్కడికి వచ్చినట్టు చెబుతారు. ఇక్కడి రాజుల ఆదరణ కారణంగా యూదులు సుఖసంతోషాలతో జీవించారు.





యూదుల ప్రార్థనఆలయం లోపలి బాగం అపూర్వమైన అలంకరణకు ప్రసిద్ధిగాంచింది. ఇజ్రాయెల్ ప్రభుత్వం ఏర్పడ్డాక, కొచ్చిన్ నుంచి చాలామంది యూదులు అక్కడికి తరలిపోయారు. అయినా, ప్రార్థనామందిరం మాత్రం భక్తి శ్రద్ధలతో పరిరక్షింపబడుతున్నది!

ఈ ప్రాంతానికి తగ్గ విధంగానే ఇక్కడి హైందవ ఆలయం సైతం విలక్షణమైన ఆకృతితో వెలుగొందుతున్నది. ఇక్కడ యూదులు, క్రైస్తవులు, హిందువులు, మహమ్మదీయులు కలిసిమెలిసి ఐకమత్యంగా జీవిస్తున్నారు.





క్రీ॥ శ॥ 1వ శతాబ్దంలో మలబారు తీరానికి సెయింట్‌థామస్ విచ్చేసినప్పుడు, ఒక యూదు బాలిక అతనికి స్వాగతం పలికిందట! ఆ కాలంలో భారతదేశంలో మతాలమధ్య వైషమ్యాలు ఉండేవికావు.

చారిత్రక భవనాలకు వెనక సముద్ర జలాలు ఈ ప్రాంతానికి అద్భుతమైన శోభను కలిగిస్తున్నాయి. ఒకవైపు ప్రశాంత గంభీరంగానూ, మరోవైపు హార్బరువంటి ఆధునిక వ్యాపార సంస్థల కారణంగా హడావుడిగానూ ఈ ప్రాంతం ఉంటున్నది.





సముద్రతీరంలో మన దృష్టిని ఆకర్షించే దృశ్యం—చీనా చేపలవలలు. ఈ ప్రాంతంలో చాలామందికి చేపలు పట్టడమే ప్రధానమైన జీవనోపాధిగా వుంటున్నది. క్రమక్రమంగా వీళ్ళు కూడా చేపలు పట్టడానికి ఆధునిక పరికరాలు ఉపయోగిస్తున్నారు.



# పితృభక్తి

ఒకప్పుడు చీనాదేశంలో టోంగ్ అనే పేద యువకుడు ఉండేవాడు. అతని తల్లి పసితనంలోనే పోయింది. అతని పంథొమ్మిదో ఏట అతని తండ్రి కూడా పోయాడు. తండ్రి శ్రమజీవి, జీవితాంతం ఒక్క రాగి డబ్బు మిగల్చలేకపోయాడు. ఆ కారణంగా టోంగ్ అనాథగా మిగిలిపోయాడు.

ముందు టోంగ్ తన తండ్రికి ఉత్తర క్రియలు జరిపించి, సమాధి కట్టించాలి. చేతిలో ఒక్క పైసా లేకుండా ఇదంతా ఎలా చేయటం? డబ్బు పుట్టించటానికి ఒకటే ఉపాయం ఉన్నది: అదేమిటంటే, టోంగ్ బానిసగా అమ్ముడు పోవటం.

టోంగ్ ఒక అట్ట మీద తన ధరా, తాను బానిసగా అమ్ముడు పోవటానికి గల నిబంధనలూ రాసి, ఆ అట్టను మెడకు తగిలించుకుని, బానిసల సంతలో ఒక రాతి అరుగు మీద కూర్చున్నాడు. బానిసలను కొనేవాళ్ళు ఆ అట్ట మీద రాసినది చదువుకుని దాటి వెళ్ళిపోయారు.

కారణమేమంటే, టోంగ్, తాను చిన్న మొత్తానికి అమ్ముడు పోదలచలేదు. తన తండ్రికి శాస్త్రోక్తంగా ఉత్తరక్రియలు చేసి, ఉన్నంతలో అందమైన సమాధి కట్టించటానికి ఎంత ఖర్చు అవుతుందో అంత మొత్తానికే అతను అమ్ముడు పోవాలని నిశ్చయించుకున్నాడు. ఆ బాకీ తాను జన్మలో తీర్చాలన్న ఆశ కూడా పెట్టుకోలేదు; బతికున్నంత కాలమూ బానిసగా జీవించటానికి కూడా సిద్ధమయాడు.

కాని, ఎన్ని గంటలు గడిచినా, అతన్ని కొనేవాడు కనిపించలేదు. తనను తాను కోరిన ధరకు ఎవరూ కొనరు కాబోలని టోంగ్ భయపడుతూండగా ఎవరో అధికారి అటుగా వచ్చాడు; టోంగ్ మెడకు వేళ్ళాడే అట్ట మీద రాసినది చదువు

చీనా జానపద కథ



కున్నాడు; తన వెంట ఉన్నవాడి చేత టోంగ్‌కు డబ్బిప్పించి, పత్రం రాయించుకున్నాడు.

టోంగ్ కోరిక నెరవేరింది. అతను తండ్రికి మంత్రోక్తంగా ఉత్తరక్రియలు జరిపించి, దానధర్మాలు యథావిధిగా చేసి, తండ్రికి అందమైన సమాధిని గొప్ప శిల్పిచేత తయారు చేయించి, తనను కొన్న యజమాని వద్దకు చేరి చాకిరి ప్రారంభించాడు. అతనికి ఒక పాక వేసి ఇచ్చారు.

కాలం గడిచిపోతున్నది. టోంగ్ జీవితానికి సుఖమూ, విశ్రాంతీ అన్నవి లేవు. ఈ దశలో కూడా అతను తన తండ్రికి శ్రద్ధగా శ్రాద్ధక్రియలు జరుపుతూ వచ్చాడు.

ఇలా ఉండగా ఒక ఏడు నూర్పిళ్ళ తరుణంలో టోంగ్‌కు జ్వరం పట్టుకున్నది. అతను మంచంలో నుంచి లేవలేక పోయాడు.

ఒక రోజు మిట్టమధ్యాన్నం వేళ టోంగ్ తీవ్రమైన జ్వరంతో ఒళ్లు తెలియకుండా పడి ఉండగా, అతని నుదురును ఎవరో చల్లగా తాకినట్టయింది. అతని శరీరాన్ని పట్టి ఉండిన నీరసం క్రమంగా తీసేసినట్టనిపించింది. తనలో ఈ మార్పుకు ఆశ్చర్యపడుతూ టోంగ్ కళ్ళు తెరిచి చూశాడు. ఒక అలౌకిక సౌందర్యవతి అతని మీదికి వంగి కనబడింది. "నువు ఎవరు?" అని అడగటానికి అతనికి ధైర్యం చాలలేదు.

ఆమె ఇంకా అతని నుదురు రాస్తూనే, "నేను నీ జబ్బు నయం చేసి, నీకు భార్యగా ఉండటానికి వచ్చాను," అన్నది.

ఆమె తనను ఏదో ఆజ్ఞాపిస్తున్నట్టుగా అతనికి అనిపించింది. అతను కంగారుతో మంచం మీది నుంచి లేచి నిలబడి, తన నీరసం పూర్తిగా పోయినట్టు తెలుసుకున్నాడు. తాను భార్యను పోషించే స్థితిలో లేనట్టు చెప్పటానికి కూడా అతనికి ధైర్యం లేకపోయింది. ఆమె ఆ సంగతి గ్రహించినట్టుగా, "జరుగుబాటు సంగతి నేను చూస్తాను," అన్నది.

టోంగ్ చాలా సిగ్గుపడిపోయి, తన చింకి బట్టలకేసి చూసుకున్నాడు. అయితే ఆమె ధరించిన బట్టలు కూడా అలాటివే. ఆమె ఒంటిన ఎక్కడా ఒక్క అభరణం లేదు. ఇద్దరూ పూజామందిరం దగ్గిర మోకరించి, పితృదేవతల పూజ చేసి భార్యాభర్త లయారు.

వారి వివాహం చాలా విడ్డూరమైనది. ఆమెది ఏ వంశమో, ఎక్కడి నుంచి వచ్చిందో టోంగ్ అడగలేదు. ఆమె తన పేరు 'చీ' అని చెప్పిందిగాని, తనను గురించి అతనితో ఇంకేమీ చెప్పలేదు.



అతని ఇంటి వాతావరణమే ఆమె రాకతో మారిపోయింది. ఇల్లంతా సర్ది, ఉన్నంతలో అందంగా ఉండేది. టోంగ్ పనికి పోయేలోపల సుష్టుగా భోజనం చేసేవాడు. తిరిగి అతను పొలంనుంచి వచ్చేసరికి భోజనం సిద్ధంగా ఉండేది.

అతని భార్య రోజల్లా మగ్గంముందు కూర్చుని, రంగురంగుల బొమ్మలతో పట్టు తానులు నేసేది. అవి అపూర్వంగా ఉండేవి. ఆమె నేర్పరితనం గురించి చుట్టుపట్ల అందరికీ తెలిసింది. వర్తకులు రోజూ వచ్చి ఆమె నేసిన పట్టుతానులను డబ్బిచ్చి కొనుక్కు పోయేవారు.

"జరుగుబాటు సంగతి నేను చూస్తాను," అన్న మాట ఆమె పూర్తిగా నిలబెట్టు కున్నది. పెట్టెలో డబ్బు పేరుతున్నది. ఒకనాడు అతనికి ఆమె పెట్టె తెరిచి, అందులో ఉన్న వెండినాణాలు చూపించి, అందులో నుంచి ఒక కాగితం తీసి అతని కిచ్చింది. అది అతని విడుదల కాగితం. యజమానికి క్రయధనం ముట్టింది. ఆనాటితో టోంగ్ బానిసత్వం ముగిసింది. టోంగ్ కళ్ళ వెంట ఆనందాశ్రువులు రాలాయి.

"దక్షిణాన నీ కోసం పొలాలూ, పట్టు పురుగుల తోటలూ కొన్నాను. ఇక నువు మరొకరికి చాకిరీ చేయనవసరం లేదు. నీ చాకిరీ నువు చేసుకోవచ్చు," అన్న దామె తన భర్తతో. టోంగ్ ఆమె పాదాల

ముందు సాష్టాంగపడబోయాడు. కాని అమె అతణ్ణి వారించింది.

అది మొదలు అతని దశ బాగా ఎత్తుకున్నది. అతను ఏం చేసినా కలిసి వచ్చింది. అతని కింద పని చేసేవాళ్ళు అతనిపట్ల ప్రేమాభిమానాలు చూపేవారు.

ఇలా ఉండగా ఆ ఇంట్లో మగ్గం ఆడటం మానేసింది. టోంగ్ భార్య గర్భవతి. అమె సకాలంలో పండువంటి కొడుకును కన్నది. వాణ్ణి చూడవచ్చిన వారంతా, "వీడు మామూలు పిల్లవాడు కాడు! వరాన పుట్టినవాడు! నూరేళ్ళు బతుకుతాడు!" అన్నారు.

ఆ యేడు చలికాలం ప్రారంభమవుతూండగా, ఒక రాత్రి అంతా భార్యాభర్తలు పిల్లవాణ్ణి గురించీ, భవిష్యత్తు గురించీ ఎడతెగకుండా మాట్లాడుకున్నారు. అమె ముఖం చూస్తుంటే అతనికి, ఎప్పటికన్నా ఎక్కువ అందంగా ఉన్నట్టు కనిపించింది. తెల్లవారబోతూండగా అమె చప్పున లేచి, అతని చెయ్యిపట్టుకుని పిల్లవాడి ఉయ్యాల తొట్టె దగ్గిరికి తీసుకుపోయింది. ఎందుకో టోంగ్ అమెను చూసి కొద్దిగా బెదిరాడు, అమెను మొదటిసారి చూసినప్పుడు బెదిరినట్టే. అతను కళ్ళు మూసుకుని, అప్రయత్నంగా అమె ముందు మోకరించాడు. అతను తల ఎత్తి అమె ముఖం కేసి చూసేసరికి అమె అవతారం పూర్తిగా మారిపోయింది. అమె ఇప్పుడు మామూలు స్త్రీలకన్న చాలా ఎత్తుగా ఉన్నది. అమె శరీరంలోనుంచి కాంతులు వెలువడుతున్నాయి.

"నే నిక నిన్ను విడిచి వెళ్ళిపోవాలి. నేను మానవస్త్రీని కాను. నీ కోసం మానవ స్త్రీని అయాను. నా జ్ఞాపక చిహ్నంగా నీకు మన కొడుకు ఉంటాడు. నీ పితృభక్తికి మెచ్చి స్వర్గాధిపతి నన్ను నీవద్దకు పంపాడు. నే నాయన దగ్గిరికి తిరిగి వెళ్ళాలి. నేను చీ-నియు అనే అప్సరసను," అన్న దామె.

క్రమంగా అమె కనిపించకుండాపోయింది.





# కృష్ణావతారం

రానురాను కృష్ణుడు చేసే అగడాలు మితిమీరిపోయి గోపకులను బీభత్సంలో ముంచెత్తాయి. ఏం చెయ్యాలో తోచక వాళ్ళు దిమ్మరపోయి చూస్తూ ఊరుకున్నారు. గోపికలు మాత్రం అలా ఊరుకోలేదు. వారంతా కూడబలుక్కుని, ఒక జట్టు యశోద వద్దకు వెళ్ళి ఆమె పైన విరుచుకుపడ్డారు.

''ఓయమ్మా, నువు కాగా ఒక గారాబు కొడుకును కన్నావు! వాడితో మేము పడే పాట్లు కూడా కాస్త చూడు మరీ! పోనీ చిన్నవాడు గదా అని చూస్తూ ఊరుకున్నందుకు ఇలాగా చేసేది? మీరు గొప్పవాళ్ళయితే అవుదురు గాక! అసలు తప్పంతా నీదే. నువే వాణ్ణిలా తయారుచేసి మా మీదికి పంపకం చేశావు. నీ గుండెలో జాలి అనేది ఏకోశానా ఉన్నట్టులేదు. నీ ముద్దుల కొడుకు ఏం చేశాడో చెవులారా విను—'' అని ఒకతె అంటుండగా మరొకతె ముందుకువచ్చి—

''ఏం చేశాడా? మా ఇంట్లో జొరబడి పది కడవల నెయ్యీ, పెరుగూ, పాలూ తాగేశాడు! 'కో' అంటూ కడవలన్నీ బోర్లా తోసేసి పారిపోయాడు. మా వంటి పేద వాళ్ళకింతకన్న ఏం కావాలి? మేమెలా బతికేట్టు?'' అన్నది.

అంతలో మరొక గోపిక ముందుకు వచ్చి, ''ఓ తల్లీ, నీ కొడుకు రాక్షసుడు! నేను బానల్లోనూ, ఉట్ల మీదా వెన్న పెట్టి ఉంచితే, అంత వెన్నా తిని, బానలు

## 4. కృష్ణుడి శైశవక్రీడలు



పడదోసి, ఉట్లు తెంచాడు. మేము వీడితో ఎలా వేగాలి? ఎక్కడికి పోవాలి?'' అన్నది.

మరొకతె అమితమైన కోపంతో, చేతులు తిప్పుకుంటూ, నాట్యం చేస్తున్న దాని లాగా యశోదను సమీపించి, ''వెనకింట్లో ఎన్నో నేతిబానలున్నాయి. తలుపుకు తాళం పెట్టి ఉంచాను. నీ మాయదారి కొడుకు వచ్చి పడి, తలుపును తాళంతో సహా విరగదన్ని, లోపల జొరబడ్డాడు. నేను హడలిపోయి పారిపోయాను. నెయ్యంతా తాగాడో, ఏం చేశాడో, ఏమో! వెళ్ళి చూద్దునుగదా, ఒక్క బొట్టు నెయ్యిలేదు. దేశం గొడ్డుపోయిందా, తల్లీ? ఈ పాట్లు పడేకన్న ఈ పల్లెకు అగ్గి పెట్టేసి, మా పశువులతో ఇంకో చోటికిపోయి నిక్షేపంగా బతుకుతాం!'' అన్నది.

మరొకతె వెనక నుంచి అందర్నీ నెట్టుకుంటూ ముందుకు వచ్చి, ''అదంతా ఏం వింటావు? మా యింట జరిగిన ఘోరం విను. నీ రాలుగాయి కొడుకు మా యింట జొరబడి పదికుండల నెయ్యీ, పాలూ, పెరుగూ ఇల్లంతా ఈ లోతున విరజిమ్మి, ఖాళీకుండలు చేతులా, కాళ్ళా తన్ని, వంటకుండల్లో ఉన్న అన్నమూ, కూరలూ పాయసమూ కుర్రకారు చేత తినిపించి, కుండలన్నీ పగలగొట్టి, దూడలను ఆవుల వద్దకు విడిచాడు. ఇంట్లో ఏడిచే బిడ్డకు ఒక్క చుక్క వెన్నగాని, పాలుగాని, పెరుగుగాని లేదు,'' అన్నది.

మరొకతె ఏడుపు గొంతుతో, ''నా మొగుడూ, పిల్లలూ తినాలని మోజుపడితే, పాలూ, పిండీ, కలకండా, వెన్నా కలిపి అట్లు వేసి కుండల దొంతరలో పెట్టాను. నీ కొడుకు దొంగలాగా వచ్చి కుండలు దించి అన్నీ తినేశాడు. వాడి కడుపులో ఏం భూతాలున్నాయో ఏమో! నిజం చెబితే నా మొగుడు నమ్ముతాడా, తల్లీ?'' అన్నది.

ఈ విధంగా ఒకరిని మించి ఒకరు యశోదకు కృష్ణుడి పైన చాడీలు చెప్పారు.



ఒకరింట బానలో కలిపి పెట్టి ఉంచిన పిండీ, పంచదారా తినేశాడు. అంతటితో పోక, కుండల్లో ఉన్న అన్నమంతా తినేశాడు; ఇవి చిన్నపిల్లలు చేసే పనులేనా? మరొకరి ఆవులనూ, దూడలనూ అడవిలోకి తరిమేశాడు; ఆ సమయానికి యింటి యజమానీ, కొడుకులూ ఇంట లేరు. అన్నీ అమానుషమైన పనులే! అందరూ అన్నీ చెప్పి, ఆఖరు మాటగా "మేమెక్కడికన్నా వెళ్ళిపోతాం. నువూ, నీ కొడుకూ ఉట్టి కట్టుకు ఊరేగండి!" అని తేల్చి చెప్పారు.

అందరి మాటలూ విని యశోద ప్రతి ఒక్కరినీ ఓదార్చి, "మీకు కలిగిన నష్టమంతా నేను అచ్చుకుంటాను, విచారించకండి. కాని మీరు లేకుండా మా కెలా గడుస్తుంది? బిడ్డ ఇలాంటి రాక్షసప్పనులు చేశాడో, లేదో. మీరేమో చేశాడంటున్నారు. మీరైనా అబద్ధా లెందుకు చెబుతారు? ఇక చూడండి, పిల్లవాణ్ణి ఎలా అదుపులో ఉంచుతానో! మీ రేమాత్రమూ సందేహించక మీ ఇళ్ళకు వెళ్ళిపొండి," అని గోపికలను పంపేసింది.

తరవాత ఆమె కృష్ణుణ్ణి చేరదీసి, "ఎందుకురా, బాబూ, వాళ్ళ ఇళ్ళకూ, వీళ్ళ ఇళ్ళకూ పోతావు? నీకు వెన్నా, పాలూ కరువయాయా? నే నిస్తాను, పాలు తాగు. గుక్కెడు తల్లిపాలకు పుట్టెడు ఇతర పాలు సమం కావంటారు. అయినవాళ్ళతో అస్తమానూ ఇలా పేచీలు తెస్తావెందుకురా?" అంటూ తన కొడుక్కు పాలిచ్చి, చెక్కులు నొక్కి, తల వాసన చూసి, ముద్దులు పెట్టుకుని, చివరకు, "పొద్దున్నే లేచి నీ అల్లరి పనులు వినటంతోనే సరిపోయింది. ఇంత పనికిమాలినవాడివి, నిన్నేమనాలిరా? విడిచిపెట్టానంటే మళ్ళీ పోయి యాగీలు తెస్తావు. దుష్టుణ్ణి దయ తలచరాదు," అంటూ కృష్ణుణ్ణి రెక్క పట్టుకుని బరబరా బండి సమీపానికి తీసుకుపోయి, పెద్ద రోలుకూ, పిల్లవాడి నడుముకూ పెయ్య



తాడు కట్టి, బెత్తం ఒకటి తీసుకుని, "కదిలావా మొత్తుతాను. ఎలా కదులుతావో నేనూ చూస్తాను," అని తను ఇంటి పనులలో నిమగ్నురాలయింది.

కొంచెం సేపు గడిచింది. కృష్ణుడు తాడు పట్టి రోటిని తన దగ్గిరికి ఈడ్చుకున్నాడు. పశువుల అవరణ ద్వారం సమీపంలో రెండు మద్దిచెట్లు దగ్గిర దగ్గిరగా ఉన్నాయి. కృష్ణుడు రోటిని ఒడుపుగా ఆ మద్ది మానులకు చేరబెట్టి, తాను వాటి మధ్యగా దూరి అవతలికి వెళ్ళి, బలం కొద్దీ లాగాడు. రెండు మానులూ పెళపెళా విరిగి పడిపోయాయి. అనేకమంది గోపకులూ, గోపికలూ పరిగెత్తుకుంటూ వచ్చి, జరిగినది చూసి, అమితాశ్చర్యం చెందారు. కొందరు గోపికలు యశోద వద్దకు పరిగెత్తి వెళ్ళి, "ఏం రాక్షసిబిడ్డమ్మా నీ కొడుకు! వాణ్ణి ఎక్కడైనా రోటికి కట్టుతారా? వాడు కాస్తా వెళ్ళి, ఇంతేసి చెట్లను విరిచి మీద పడేసుకుంటున్నాడు! చాలా తెలివిగా చేశాననుకుంటున్నావు కాబోలు. వెళ్ళి, బిడ్డకు ప్రమాదం రాకుండా చూసుకో!" అని చెప్పారు.

యశోద కీ మాట వినగానే గుండె ఝల్లుమన్నది. "అమ్మయ్యో!" అని కేక పెట్టి, పైట జారిపోయేదీ, జుట్టుముడి ఊడిపోయేదీ కూడా తెలియకుండా పరుగు తీసింది. గోపికలు ఆమె వెంట పరిగెత్తారు.

ఈలోపుగా నందుడూ, ఇతర గోపకులూ అక్కడికి వచ్చి, విరిగిపడి ఉన్న చెట్ల మధ్య కృష్ణుడు, మేఘాల మధ్య చంద్రుడిలాగా, నవ్వుముఖంతో కూర్చుని ఉండటం చూశారు. నందుడు చప్పున వచ్చి, పిల్లవాడి నడుముకు కట్టి ఉన్న పలుపుతాడు విప్పి, కుర్రవాణ్ణి ఎత్తుకుని, "వీడి నడుముకీ తాడేమిటి? తాటికి రోలేమిటి? దీన్ని ఈడ్చుకుంటూ వీడింత దూరం ఎలా వచ్చాడు? ఇంత పెద్ద మానులు ఎలా విరిగిపడ్డాయి? ఏమిటిదంతా?" అని అడిగాడు.



యశోద వచ్చి తానే కుర్రవాణ్ణి రోటికి తాడుతో కట్టానని చెప్పింది, నందుడు తన కొడుకు బలసత్వాలకు లోలోపల ఆశ్చర్యపోయి, పరమానందం చెందాడు.

ముసలి గోపకులకు ఇదేమీ అంతుచిక్క లేదు. ''ఒక గాలి లేదు. పిడుగుపాటు లేదు, ఏ ఏనుగూ ఇటు కేసి రాలేదు, పోనీ సేనలన్నా రాలేదు; ఇలాటి సబబైన కారణాలేమీ లేకుండా, చంటివెధవ ఇంతేసి చెట్లను పడగూల్చాడు గదా, ఇంత కంటె ఉత్పాతం ఏం కావాలి ? ఇదేమన్నా మొదటిసారి కనకనా ? రాక్షసిముండ పూతన అమాంతం చచ్చింది. అంత లావు బండి అకారణంగా ముక్కలుముక్కలయింది. ఇక్కడ ఉండటమే ప్రమాదంగా వుంది. కాని పుట్టి పెరిగిన ఈ చోటు విడిచి ఎక్కడికని పోతాం ?'' అని తమలో తాము అనుకుంటూ తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

రోజులు గడిచాయి. బలరాముడికి ఎనిమిదేళ్ళూ, కృష్ణుడికి ఏడేళ్ళూ నిండాయి. వాళ్ళు తమ యీడు గోపబాలకులతో కూడి ఆడుతూ, దూడలతో ఆడుకుంటూ ఉత్సాహంగా కాలం గడుపుతున్నారు. చేతుల్లో చద్దిచిక్కాలూ, చెరణాకోలలూ తీసుకునేవాళ్ళు; కాళ్ళకు కర్రచెప్పులు తొడిగేవాళ్ళు. పొట్టిజుట్టు ఎగరేసుకుంటూ బయలుదేరేవాళ్ళు; చుట్టుపక్కల ఉండే భూముల్లో గట్టిగా కేకలు పెడుతూ తోడేళ్ళను తరిమేవాళ్ళు; సరదాగా పాటలు పాడేవాళ్ళు; కూతలు పెట్టేవాళ్ళు; చెట్లెక్కేవాళ్ళు; తేనెపట్లు కనిపిస్తే తేనె తాగేవాళ్ళు; తెచ్చుకున్న అన్నాలు తినేవాళ్ళు. ఆ యాదవబాలకులకు జీవితం మధురమైన ఆటవిడుపులాగా సాగింది.

ఇలా కాలం గడుస్తుండగా, ఒకనాడు కృష్ణుడు బలరాముడి దగ్గరికి వచ్చి ఇలా అన్నాడు :

''అన్నా, మనం ఈ వనంలోనే పుట్టాం, ఇన్నాళ్ళూ ఇక్కడే పెరిగాం. అయినా,



మందలూ, గోపకులూ ఇంతకాలం పాటు ఒకేచోట ఉండటం మంచిదా? మేత బీళ్ళన్నిటినీ పశువులు పూర్తిగా మట్టగించేశాయి. చెట్లు నరుకుడుపడి ధ్వంసమయాయి. చెరువులూ, మడుగులూ ఎండిపోయి రొంపిగుంటలయాయి. కూరలూ, కట్టెలూ కావాలంటే మనవాళ్ళు చాలా దూరం వెళ్ళవలసి వస్తున్నది. కనక మనం ఈ ప్రదేశం వదిలిపెట్టి బృందావనానికి వెళ్ళిపోదాం. అది చాలా అందమైన వనమని చెబుతారు. అక్కడ సుందరమైన గోవర్ధనగిరి ఉన్నదట. దానిపైన భాండీర మనే పేరుగల మహావటవృక్షం ఉన్నదట. బృందావనం మధ్యగా ఎప్పుడూ కాళిందీనది ప్రవహిస్తూ వుంటుందట. అక్కడికి వెళ్ళిపోయి సుఖంగా బతుకుదాం. అయితే, ముసలివాళ్ళు ఈ చోటు విడవటానికి ఇష్టపడకుండా ఉన్నారు. వాళ్ళను అదరగొట్టటానికి ఇప్పుడే ఒక ఉపాయం చేస్తాను, చూడు.''

ఇలా అంటూండగానే కృష్ణుడి శరీరం నుంచి వందల సంఖ్యలోనూ, వేల సంఖ్యలోనూ తోడేళ్ళు గుంపులు గుంపులుగా బయలుదేరి, చుట్టుపక్కల ప్రదేశమంతటా పరిగెత్తసాగాయి. గోపాలకులకూ, గోపులకూ గాభరా పుట్టిపోయింది. ఈ తోడేళ్ళ దౌష్ట్యం అసాధారణంగా కనబడింది. వాటిని వేటాడటం గోపకులకు ఎంతమాత్రమూ సాధ్యం కాలేదు. పులులను సైతం నిలవవేయగల ఆబోతులను అవి చంపాయి. కాచేవాళ్ళు తల తిప్పి చూసేలోపుగా ఎటునుంచో వచ్చి అవి దూడలను కాజేసుకుపోయాయి. ఈ ఉత్పాతానికి తోడు రాత్రి సమయాలలో పులుల రంకెలూ, సింహగర్జనలూ, వినిపించసాగాయి. పెద్దపెద్ద పందులు వచ్చి, ఎక్కడబడితే అక్కడ గుంటలు తవ్వుతున్నాయి.

గోపకుల పెద్దలంతా చేరి, దీర్ఘంగా చర్చించారు. ఇదివరకు జరిగిన ఉత్పాతాలకే బెదిరి కూడా, వాళ్ళు ఇంతకాలం

ఉన్నచోటు విడిచిపెట్టలేక వాటిని సహించి ఊరుకుంటే, ఇప్పుడు వాటన్నిటినీ మించిన ఉత్పాతం వచ్చిపడింది. ఏం చెయ్యాలి ?

"బృందావనం చాలా దివ్యంగా ఉంటుందని అందరూ తెగచెబుతున్నారు. కాని అక్కడ కూడా దుర్గమ ప్రాంతాలున్నాయట; వాటిలో రాక్షసులుంటారట. ఏమైనా, ఏదో ఒకటి చెయ్యాలి. ఎక్కడికైనా వెంటనే పోవలిసిందే గాని ఇక్కడ ఇక మీదట ఒక్క క్షణం ఉండటం సాధ్యపడదు. క్షణక్షణానికీ ఏదో నష్టం జరుగుతూనే ఉన్నది," అని గోప వృద్ధులు తేల్చారు.

వారందరూ ఈ విధంగా అనుకుంటూండగా అక్కడికి నారదుడు వచ్చి, నంద గోపుణ్ణి పిలిచి, దూరంగా తీసుకుపోయి, "మీరందరూ కలిసి బృందావనం వెళ్ళాలనుకుంటున్నారు. కాని అక్కడ రాక్షసులున్నారనీ, నీ కొడుకుకు ప్రమాదం చేస్తారేమోననీ నువు భయపడుతున్నావు. అవునా ? విను. నీ కొడుకును మనుష్యమాత్రుడుగా భావించకు. అతను రాక్షసులను చంపటానికే అవతారమెత్తిన ఆది నారాయణుడు. కృష్ణుడూ, బలరాముడూ కూడా నారాయణాంశన పుట్టినవాళ్ళే. కృష్ణుణ్ణి చంపటానికి రాక్షసులు పూతన రూపంలో వచ్చి, బండిలో దాగీ, మద్దిచెట్ల రూపం ధరించీ, అతన్ని చంపలేకపోగా, తామే అతని చేతిలో చచ్చారు. ఇవన్నీ నువు ప్రత్యక్షంగా చూశావుకద ? అందుచేత, ఏమాత్రమూ సంకోచం లేకుండా మీ అందరి నివాసమూ త్వరలో బృందావనానికి మార్చు. మీ గోపకులానికి తప్పక మేలు కలుగుతుంది," అని చెప్పాడు.

నారదుడు కృష్ణుణ్ణి కూడా చూసి, అదే మాట చెప్పి వెళ్ళిపోయాడు. ఆ తరవాత, నందగోపుడు మిగిలిన గోపకులతో, "మనమంతా బృందావనానికి తరలిపోతున్నాం. అదే నిశ్చయం. అందరూ అందుకుగాను వెంటనే ప్రయాణసన్నాహం ప్రారంభించండి," అన్నాడు.





# పుణ్యం మార్పిడి

వైభోగుడనే భాగ్యవంతుడికి, పెద్ద జబ్బు చేసింది. వైద్యుడు ఎన్ని మందులు వాడినా, అతని మీద ఏమాత్రం పని చేయడం లేదు.

ఒక రోజున వైభోగుడు, వైద్యుడితో, "అయ్యా, సంపదకోసం, నేనెన్నో పాపాలు చేశాను. ఒక్క పుణ్యకార్యం కూడా చేయలేదు. నా పాపమే, నన్నిలా బాధిస్తున్నది. అందువల్లనే, నాకు మందులు పని చేయడం లేదు. చనిపోయాక, నరకానికి వెళతానని, నాకిప్పుడు బెంగగా వున్నది," అని వాపోయాడు.

వైభోగుడు మానసికంగా బాధపడుతున్నాడనీ, అందుకే తన మందులు పట్టివ్వడం లేదనీ, వైద్యుడు గ్రహించి, "మీరు దిగులుపడకండి. ఈ రోజే మీచేత పుణ్యకార్యం చేయిస్తాను. ధానితో మీ పాపాలన్నీపటాపంచలైపోతాయి. అప్పుడు, మందులూ పని చేస్తాయి," అని ధైర్యం చెప్పాడు.

అ ఊళ్లోనే, ప్రలోభుడనే పేదరైతున్నాడు. వాడికి భార్యా, యిద్దరు పిల్లలు. ఏటా వాడెంతో శ్రమపడి పొలం పని చేస్తూంటాడు. అయినా, పంట చేతికి అందివచ్చే సమయానికి, ఏదో ప్రమాదం ముంచుకువచ్చి, వాడికి నష్టం కలిగేది. ఒకసారి ధాన్యం వానకు తడిసి కుళ్ళిపోయింది. ఒకసారి కుప్పకు నిప్పంటుకున్నది. మరొకసారి ఇంట్లో దొంగలు పడ్డారు. ఈ కారణంగా, వాడు అప్పుల పాలైపోయాడు.

వైభోగుడి ద్వారా, ప్రలోభుడి కేదైనా ఉపకారం చేయించాలని, వైద్యుడనుకున్నాడు. అయన ప్రలోభుణ్ణి, వైభోగుడి దగ్గిరకు తీసుకువెళ్ళి, "అవసరం లేని వాళ్ళకు వందమందికి సాయపడడం

జొన్నలగడ్డ రామలక్ష్మి

కంటే, ఇలాంటి ఒక్కడికి దానమిస్తే, మీకు అంతులేని పుణ్యం కలుగుతుంది," అని చెప్పాడు.

వైభోగుడు వెంటనే, ప్రలోభుడి యిబ్బందులు అడిగి తెలుసుకుని, వాడికున్న బాకీలన్నీ తీర్చేసి, ఒక సంవత్సరానికి సరిపడా గ్రాసం యిచ్చి పంపేశాడు.

ఆ తర్వాత, వైభోగుడికి మందులు పని చెయ్యడం ప్రారంభించాయి. వారం రోజుల్లో, ఆయన జబ్బు తగ్గిపోయింది. మరొక వారం రోజులకే, పూర్తిగా మామూలు మనిషయాడు.

జరిగిన విశేషం వైద్యుడి ద్వారానూ, వైభోగుడి ద్వారానూ కూడా, ఊరంతా ప్రచారమైంది.

"అందరం యింతో, అంతో దానాలు చేస్తూనే వున్నాం. ఇలాంటి అద్భుతాలు జరగలేదు. ప్రలోభుడిలో, ఏదో విశేషం వున్నది!" అని చాలామంది చెప్పుకున్నారు.

ఈ సంగతి ప్రలోభుడికి తెలిసింది. ఆ రోజు నుంచీ, వాడూ తన కథను చెప్పుకుంటూ, ఇంటింటికీ తిరగసాగాడు. ప్రతివారూ ఏదో అద్భుతం జరుగుతుందన్న ఆశతో, వాడికి తమ శక్తికొద్దీ, ఏదో ఒకటి యిస్తూండేవారు. కొందరు తిండిగింజలిస్తే, కొందరు రాగికాసులిచ్చేవారు. ఆరంభంలో కాకతాళీయంగా కొందరికి ఏదో మేలు జరగడంతో, ప్రలోభుడిలో ఏదో అద్భుతశక్తి వున్నదని మరింతగా ప్రచారం జరిగింది.



ఇప్పుడు, ప్రలోభుడికి జీవితం సుఖంగా సాగిపోతున్నది. అప్పుడప్పుడు వాడు పొరుగూళ్ళకు వెళ్ళి, తన కథ చెప్పుకుని దానం పడుతూండేవాడు.

"అత్యాశతో నువ్వు బిచ్చగాడుగా మారిపోయావు. ఇప్పుడు మన కేలోటూ లేదు. మళ్ళీ పూర్వంలా కష్టపడి బతుకుదాం," అన్నది ప్రలోభుడి భార్య.

"కష్టపడి పని చేసినంతకాలం, మన రోజులు బాగాలేవు. ఇదే మనకు అచ్చి వచ్చింది. నాకు సుఖంగా కూడా వున్నది," అని జవాబిచ్చాడు ప్రలోభుడు.

వాడి భార్య అందుకు ఒప్పుకోక, "మనం కష్టాల్లో వున్నప్పుడు దానం చేశాడు కాబట్టి, వైభోగుడికి పుణ్యం వచ్చింది. మన కిప్పుడు అవసరం లేదు కాబట్టి, దానం చేసినవారికి పుణ్యమూ వుండదు; పుణ్యఫలితమూ వుండదు. ఊళ్ళోవాళ్ళందరూ, ఈ సంగతి తెలుసుకుని, దానం చేయడం మానేస్తే, అప్పుడు మనగతి ఏమౌతుంది? సోమరితనం, అన్ని జబ్బులకంటే ప్రమాదకరమైనది. ఒకసారి పట్టుకుంటే మరి వదలదు!"

ప్రలోభుడు, భార్య మాటలు లెక్క చేయకుండా, తన పద్ధతిలోనే ధన సంపాదన చేయసాగాడు.

ఇలా కొన్నాళ్ళు గడిచాక, వాడికి జబ్బు చేసింది.

ఆ ఊళ్లో ఎవరికి జబ్బు చేసినా, ముందుగా ప్రలోభుడికి ఏమైనా దానంగా



యిచ్చి, తర్వాత మందు పుచ్చుకోవడం ఆచారమయింది. తానిప్పుడు ఎవరికి దానం యివ్వాలా అని, ప్రలోభుడు. వైద్యుడి దగ్గిర తన స్థితి చెప్పుకుని బాధపడ్డాడు.

ఇది విని వైద్యుడు ఏదో ఆలోచిస్తూండగా, ప్రలోభుడి భార్య, ఆయనను పక్కకు పిలిచి, ''మీ కారణంగా అంతవరకూ గౌరవంగా బతికే, నా భర్త బిచ్చగాడైపోయాడు. ఎన్ని చెప్పినా వినడం లేదు; మారడం లేదు. బిచ్చగాడి భార్యనని చెప్పుకునేందుకు, నలుగురిలోనూ నాకెంతో చిన్నతనంగా వున్నది. పూర్వం కష్టపడి పని చేసే, నా భర్త, సోమరితనం కారణంగానే, యిప్పుడు మంచానపడ్డాడు. వైద్యం చేయడమే కాక, నా భర్త బుద్ధి మారేలా కూడా, ఏదైనా మందివ్వండి!'' అని చెప్పింది.

వైద్యుడికప్పుడు, తను చేసిన పొరబాటు అర్థమయింది. ఆయన ప్రలోభుడితో, ''దానధర్మాలవల్ల కొత్తగా పుణ్యం పుట్టదు; మార్పిడి జరుగుతుంది, అంతే! నువ్వు, వైభోగుడి వద్ద దానంపడితే, నీ పుణ్యంలో కొంత, అతడికి పోయింది. ఆ తర్వాత వరుసగా దానాలు పట్టడం వల్ల, క్రమంగా నీ పుణ్యమంతా పోయి, నీకిలా జబ్బు చేసింది. ఇప్పటికి మందులతో, నీ జబ్బు నయం చేస్తాను. ఆ తర్వాత, దానం పట్టావా, నీకిక పుణ్యం వుండదు సరికదా, పుణ్యరి లేకుండా దానం పట్టిన పాపం వస్తుంది. ఆ తర్వాత, ఏ వైద్యం చేసినా నువ్వీక బతకవు!'' అని చెప్పాడు.

వైద్యుడు చెప్పింది విని, ప్రలోభుడు హడలిపోయాడు. జీవితంలో మళ్లీ దానం పట్టనని, వాడు ప్రమాణం చేశాడు. వైద్యుడి మందులకు మామూలు మనిషయ్యాక, వాడు తిరిగి ఎప్పటిలాగే కష్టించి పని చేసి జీవించసాగాడు.

ఈసారి ప్రలోభుడికి, అన్నీ కలిసి వచ్చి, కొన్నేళ్ళ తర్వాత, తానూ భాగ్యవంతుడయ్యాడు.





# మహిమగలచెట్టు!

వైతరణి రాజ్యాన్నేలే కూర్మరాజుకు, తిమ్మరాజు ఒక్కడే కొడుకు. కూర్మరాజు అతడికి యౌవరాజ్య పట్టాభిషేకం చేశాడు. ఒకనాడు తిమ్మరాజు ఏకాంతంగా కూర్చుని, తమ వంశచరిత్రను చదువుతూండగా, అందులో ఒకచోట యిలా వున్నది: వైతరణికి ఉత్తరాన అరణ్యంలో, ఒక ముష్టిచెట్టు వున్నది. దానికింద నిలబడి కోరినరూపాలు ధరించగలరు. ఆ చెట్టు సాయంతో కొందరు రాజులు ప్రజల సమస్యలు పరిష్కరించి, రాజ్యాన్ని సుభిక్షం చేశారు.

ఇది చదివిన తిమ్మరాజు అరణ్యానికి వెళ్ళి, పది రోజులపాటు గాలించి మహిమగల ముష్టిచెట్టును తెలుసుకున్నాడు. అది మోడుబారి ఎండిపోయేదశలో వున్నది. తిమ్మరాజు దానికింద నిలబడి సైన్యాధిపతి, మంత్రి రూపాలు కోరుకుని, మరుక్షణమే అచ్చం వాళ్ళ రూపాల్లోకి మారిపోయాడు.

తిమ్మరాజు, యీ అద్భుతానికి నిర్ఘాంతపోయి, ఆ మహిమగల చెట్టు సాయంతో, పూర్వపు రాజుల లాగా ప్రజల సమస్యలు తీర్చి, మంచి రాజన్న పేరు తెచ్చుకోవాలని నిర్ణయించుకున్నాడు.

ఆ మర్నాడు, తిమ్మరాజు ఉద్యానవనంలో వుండగా, సైన్యాధిపతి భార్య వచ్చి, ''ప్రభూ, నా పిల్లలు భోజనం చేసి రెండు రోజులైంది. వాళ్ళకు, వాళ్ళ నాన్నగారి పక్కన కూర్చుని భోజనం చేయడం అలవాటు,'' అన్నది.

సైన్యాధిపతి రెండు రోజులక్రితం, సరిహద్దుల్లో వున్న సైన్యపరివేక్షణకై వెళ్లాడు. సైన్యాధిపతి భార్య చెప్పినది విన్న తిమ్మరాజుకు, చప్పున అరణ్యంలో వున్న మహిమగలచెట్టు గుర్తుకు వచ్చింది.

మల్లవరపు మనోహరరెడ్డి



అతడు, సైన్యాధిపతి భార్యను బెంగ పడవద్దని చెప్పి పంపివేసి, తిన్నగా అరణ్యంలోకి వెళ్ళాడు.

అక్కడ తిమ్మరాజు చెట్టు కింద నిలబడి, సైన్యాధిపతి రూపం తెచ్చుకుని, సైన్యాధిపతి యింటికి వెళ్ళాడు.

తమ తండ్రి రూపంలో వచ్చిన తిమ్మరాజును చూడగానే, సైన్యాధిపతి పిల్లలు అతడి కాళ్ళను చుట్టేశారు. సైన్యాధిపతి భార్య ఎంతో సంతోషంగా పిల్లలకు భోజనం వడ్డించింది. తిమ్మరాజు వాళ్ళ పక్కన కూర్చుని తినిపించసాగాడు.

సరిగా అదే సమయంలో, సరిహద్దు ప్రాంతాలకు వెళ్ళిన సైన్యాధిపతి తిరిగి వచ్చాడు. అతడు, తన రూపంతో వున్న తిమ్మరాజును చూసి ఆగ్రహంతో ఊగిపోతూ, "దుర్మార్గుడా, ఎవరు నువ్వ?" అంటూ, దుడ్డుకర్ర తీసుకుని బాదసాగాడు.

ఆ దెబ్బలను ఓర్చుకోలేక తిమ్మరాజు, మొర్రోమంటూ కుప్పకూలిపోయి, జరిగినదంతా చెప్పి, స్పృహ కోల్పోయాడు. అతడు కోలుకునేందుకు పది రోజులు పట్టింది.

ఒకనాడు తిమ్మరాజు, ప్రజల యోగక్షేమాలు తెలుసుకోగోరి మారు వేషంలో బయలుదేరాడు. అతడు ఒక ఇంట్లో తీవ్రస్వరంతో మాట్లాడుకుంటున్న భార్యాభర్తలను చూసి, చాటుగా పొంచివుండి, వాళ్ళ మాటలను ఆలకించసాగాడు.

"దీని వయసుపిల్లలు పెళ్ళిళ్ళయి, కాపరాలు చేసుకుంటూంటే, దీని బతుకిలా తెల్లారిపోవలసిందేనా?" అని భార్య భర్తను కసురుకుంటున్నది.

అందుకు భర్త, "ఆగవే! ఆ దేవయ్యను రానీ, దీని పెళ్ళి క్షణాల్లో జరిపిస్తాను," అన్నాడు.

తిమ్మరాజు అక్కడి నుంచి కదిలి, ఒక సందుమలుపు తిరిగేసరికి ఒక వర్తకుడి ఇంట్లో నుంచి మాటలు వినిపించాయి. అతడు ఆ మాటలు కూడా వినసాగాడు.

వర్తకుడి కొడుకు, తండ్రితో, "ఆ దేవయ్య వచ్చేవరకూ, మనం వ్యాపారం

మాని, గోళ్ళుగిల్లుకుంటూ కూర్చోవలసిందేనా ?'' అన్నాడు.

దానికి వర్తకుడు, ''అంతే గదా, బాబూ !'' అని జవాబిచ్చాడు.

''ఆయన రావడం, మన కష్టాలు తీరడం జరిగే పనేనా ?'' అన్నాడు వర్తకుడి కొడుకు విచారంగా.

ఈ సంభాషణ విన్నాక తిమ్మరాజు, ఒక నిర్ణయానికి వచ్చాడు. దేవయ్య రాక వల్ల, రెండు కుటుంబాల సమస్యలు పరిష్కారం అవుతాయి ! కనుక, తాను దేవయ్య రూపంలో వచ్చి, వారికి సాయపడాలనుకున్నాడు. అ వెంటనే అతడు అరణ్యంలోని మహిమగలచెట్టు వద్దకు పోయి, దేవయ్య రూపంలో తిరిగివచ్చాడు.

ఈ దేవయ్య అనేవాడు, కొద్దిపాటి పెట్టుబడితో సముద్ర వ్యాపారం చేసే వర్తకుడు. ఇతను, చంద్రయ్య అనేవాడి దగ్గిర నుంచి, కూతురు పెళ్ళికని దాచుకున్న పదివేల వరహాలనూ, వడ్డీ ఆశపెట్టి తీసుకున్నాడు. ఉల్లిపాయల వ్యాపారం చేసే వర్తకుడి నుంచి, ఉల్లిపాయలను అప్పుగా తీసుకున్నాడు. ఆ తర్వాత పడవలలో తూర్పు దీవులకు వెళ్ళి, అక్కడ నష్టపోయాడు. తిరిగి వచ్చి ఋణదాతలకు మొహం చూపించలేక, దేవయ్య ఆ దీవుల్లోనే కూలీనాలీ చేసుకుంటూ స్థిరపడిపోయాడు.



దేవయ్య రూపంలో వున్న తిమ్మరాజు, మొదట వర్తకుడి ఇంటి తలుపుతట్టి, అతడు తలుపు తీయగానే, ''ఏం, శెట్టిగారూ, బావున్నారా ?'' అని అడిగాడు.

దేవయ్యను పోల్చుకోగానే, వర్తకుడు ఆవేశంతో, తిమ్మరాజును లోపలికి లాగాడు. తర్వాత తండ్రీ కొడుకులు అతణ్ణి చితకకొట్టి, చేతులు కట్టేసి, ''ఉల్లిపాయల డబ్బంతా వడ్డీతోసహా కట్టు !'' అన్నారు.

సంగతి బోధపడేసరికి, తిమ్మరాజుకు నిలువుగుడ్లు పడిపోయాయి. ఈ లోపల వర్తకుడి కొడుకు పోయి, చంద్రయ్యను పిలుచుకువచ్చాడు.



చంద్రయ్య వస్తూనే, తిమ్మరాజును పిడికిళ్ళతో పొడిచి, "కల్లబొల్లి కబుర్లు చెప్పి, పదివేల వరహాలు కాజేసి, పెళ్ళి కావలసిన నా బిడ్డకు అన్యాయంచేస్తావా? పద, రాజుగారిదగ్గిర తేల్చుకుందాం!" అని తిమ్మరాజును కోటకు తీసుకుపోయాడు.

అక్కడ మంత్రి, చంద్రయ్యా, వర్తకుడూ చెప్పిందివిని, "రాజుగారి ఆరోగ్యం బాగాలేదు. యువరాజుగారు ఎక్కడికోవెళ్ళారు. వీణ్ణి ప్రస్తుతానికి కారాగారంలో వేయిస్తాను." అని తిమ్మరాజును భటులకు అప్పగించాడు.

కారాగారంలో వున్న తిమ్మరాజు, గస్తీ భటుల్లో ఒకడి కాళ్ళావేళ్ళాపడి, మంత్రిని పిలిపించుకుని, ఆయనకు సంగతిచెప్పి, విడుదలయాడు.

కొన్ని నెలలు గడిచాక, రాచనగరులో చిత్రంగా దొంగతనాలు జరగసాగినై. ఒకనాడు కోశాగారంలోంచి చాలా పెద్ద మొత్తం డబ్బుపోయింది. ఇంకొకనాడు రాణీగారి నగలభోషాణం ఖాళీ అయింది.

దొంగను పట్టడం ఎవరివల్లా కాకపోయే సరికి, తిమ్మరాజు స్వయంగా, ఆ పనికి పూనుకున్నాడు. అతను ఒకరాత్రి ఊర కుక్క రూపంలో, కోట ముఖద్వారాన్ని కాపలా కాస్తూండగా, దొంగ పెద్ద మూటతో అటుగా వచ్చాడు. తిమ్మరాజు పెద్దగా మొరుగుతూ, వాడిమీదికి పోయాడు. దొంగ చేతికందిన రాయి తీసుకుని, తిమ్మరాజు మీదికి విసిరి పారిపోయాడు.

అయినా, తిమ్మరాజు మొరుగుతూ దొంగవెంటపడ్డాడు. దొంగ సైన్యాధిపతి ఇంటికేసి పరిగెత్తి, అక్కడ దొంగరూపం నుంచి సైన్యాధిపతి రూపందాల్చి, ఇంటి లోకి వెళ్ళాడు.

తిమ్మరాజుకు సంగతి అర్థమైంది. సైన్యాధిపతి మహిమగల చెట్టు రహస్యం తెలుసుకుని, యిలా ద్రోహానికి పాల్పడ్డా డన్న మాట!

తిమ్మరాజు వెంటనే యువరాజుగా మారి, భటులచేత సేనాధిపతిని బంధింప

జేసి, జరిగినదంతా వివరంగా తండ్రికి చెప్పాడు.

రాజు అంతావిని, "అది మహిమగల చెట్టు కాదు; పనికిమాలినచెట్టు. దాన్ని వెంటనే నరికించివెయ్యి!" అన్నాడు.

అందుకు తిమ్మరాజు ఒప్పుకోక, "అది మన పూర్వీకుల కాలంనుంచీ, మనను కాపాడిన చెట్టు. దానివల్ల చెడుకన్న మంచే ఎక్కువ జరిగే అవకాశం వున్నది. ఒకపనిచేద్దాం. ఆ చెట్టు చాయలకు యితరులెవరూ వెళ్ళకుండా, గట్టి రక్షణ ఏర్పాటుచేస్తే సరిపోతుంది," అన్నాడు.



ఆ మర్నాటినుంచీ మహిమగల ముష్టి చెట్టుకు,బందోబస్తుఏర్పాటుచేయబడింది.

ఒక నెలరోజులు జరిగాక, రాణీగారికి ఒంటిశిరసుపోటు వచ్చింది. ఆస్థాన వైద్యుడు ఆమెను పరీక్షించి, "మహారాజా, ఈ వ్యాధి కుదరాలంటే కట్టెలు కొట్టే రామన్న కావాలి. వాడు నాకు కనిపించి చాలాకాలమైంది. వెతికించండి!" అన్నాడు రాజుతో.

తిమ్మరాజు, రామన్నకోసం ఎంత వెతికించినా, వాడు కనబడలేదు. విసిగిపోయి, తిమ్మరాజు, రామన్న రూపం ధరించి,ఆస్థాన వైద్యుణ్ణి కలుసుకున్నాడు.

ఆస్థాన వైద్యుడు, అతనితో, "రామన్నా, నీకు తెలిసిన దేవగన్నేరు చెట్టు వేరు కావాలి. దానితో రాణీగారికి వైద్యం చేయవలసివుంది," అని చెప్పాడు.

తిమ్మరాజు అరణ్యానికి వెళ్ళి, దేవగన్నేరుచెట్టు తెలియక చెట్టూ, పుట్టా గాలింపు మొదలుపెట్టాడు.

కారాగారంలో వున్నప్పుడు, తిమ్మరాజు ద్వారా చెట్టు మహిమ విన్నప్పటినుంచీ మంత్రి తాను రాజు కావాలన్న ఆలోచనలో వున్నాడు. కాపలాభటుల్ని లోగట్టుకుని, అతడు రాజు రూపం ధరించాడు. తర్వాత ఆ చెట్టును కొట్టివేయిస్తే, మరొకరూ, మరొకరూ రూపాలు మార్చుకునే అవకాశం లేకుండాపోతుందని, భటులను చెట్టును నరికి వేయవలసిందిగా ఆజ్ఞాపించాడు.

అయితే, చెట్టును నరకడానికి భటు లెవరూ ముందుకురాక, "ఈ మహిమగల చెట్టును నరికితే, కోరి అనర్థం తెచ్చు కున్నట్టే! ఈ పనిమాత్రం, మాకు చెప్ప కండి." అన్నారు.

"అయితే, ఈ చుట్టుపక్కల ఎక్కడైనా కట్టెలు కొట్టుకు బతికేవాడు కనబడితే, పట్టుకురండి!" అన్నాడు మంత్రి.

భటులుపోయి, రామన్న రూపంలో వున్న యువరాజును పట్టుకువచ్చారు. అతడు కూడా చెట్టును నరకడానికి నిరాకరించాడు. రాజు రూపంలో వున్న మంత్రి, "నా మాటనే తిరస్కరిస్తావా?" అని యువరాజును కొరడాలతో కొట్టమని భటులకు ఆజ్ఞయిచ్చాడు.

భటులు కొరడాలు ఎత్తేలోపలే, తిమ్మ రాజు గొడ్డలితో మహిమగల చెట్టును నరకడం ప్రారంభించి, కొద్దిసేపట్లోనే దాన్ని పేళ్ళుగా చేశాడు.

భటులు, ఆ పేళ్ళను అప్పటికప్పుడే తగలబెట్టారు. మరుక్షణం రామన్న రూపంలో వున్న యువరాజుకు, నిజరూపం వచ్చేసింది. ఇది చూసి మంత్రి హడలి పోయి అక్కడి నుంచి పారిపోయాడు. భటులు క్షమించమంటూ తిమ్మరాజు కాళ్ళ మీద పడ్డారు.

తిమ్మరాజు కోటకు తిరిగివచ్చి, మంత్రి ద్రోహచింతన గురించీ, తాను మహిమగల చెట్టును నరికి బూడిదచేసిన సంగతీ తండ్రికి చెప్పాడు.

రాజు అంతా విని, "ఆ కట్టెలు కొట్టే రామన్న ఎక్కడున్నాడో మరొకసారి వెతికించి, మీ అమ్మకు చికిత్స సరిగా జరిగే ఏర్పాటు చెయ్యి. ఈ గొడవకంతకూ కారణమైన మన వంశ చరిత్ర తాళ పత్రాలు మరెవరికంటా పడకుండా జాగ్రత్తగా ఎక్కడైనా దాచెయ్యి." అని తిమ్మరాజుకు సలహాయిచ్చాడు.

ఇంతజరిగాక తిమ్మరాజుకు జ్ఞానోదయ మైంది. తండ్రి తదనంతరం అతడు రాజయ్యాక, తన స్వశక్తిపైతప్ప, మంత్రాలూ, మహిమల జోలికి పోలేదు.






# కోతిపైసలు

ఒక గ్రామంలో ఒక ముసలివా డుండేవాడు. ఒకనాడు వాడు తన భార్య ఇచ్చిన అటుకులు మూటకట్టుకుని కొండ మీద గడ్డి కోయబోయాడు. అక్కడ వాడు తన అటుకుల మూటను ఒక చెట్టుకొమ్మకు వేళ్ళాడగట్టి, గడ్డి కోయ నారంభించాడు. వాడు కొంతసేపు గడ్డి కోసి, అలుపు తీరటానికి కూర్చుని ఉండగా ఎక్కడినుంచో కోతులు మందగా వచ్చి, చెట్టుకొమ్మన వేళ్ళాడే మూట నుంచి అటుకులు తీసుకుని తినేశాయి.

ముసలివాడు ఇదంతా చూస్తూ, మాటా పలుకూ లేకుండా, కదలక మెదలక కూర్చున్నాడు. కోతులు వాణ్ణి చూసి ఏదో విగ్రహమనుకుని, కొంతసేపు కిచకిచలాడాయి. తరవాత కూడబలుక్కున్నట్టుగా అవి అన్నీ ముసలివాడి వద్దకు వచ్చి, వాణ్ణి ఎత్తుకుని, కొంత దూరంలో ఉండే పాడుబడిన గుడికి తీసుకుపోయి, దాని మెట్ల మీద కూర్చోబెట్టాయి.

తరవాత అవి వెళ్ళిపోయి కొంతసేపటికి గుప్పిళ్ళతో డబ్బులు తెచ్చి ముసలివాడి ముందు వెదజల్లి, తమ దారిన తాము వెళ్ళిపోయాయి.

అంతసేపూ ముసలివాడు కళ్ళు మూసుకుని కదలకుండా కూర్చున్నాడు. ఆ గుడిలో ఉండే విగ్రహానికి దారే పొయ్యే వాళ్ళు చిల్లరడబ్బులు వెయ్యటం ఆ కోతులు చూసి ఉండాలి. ఆ డబ్బులను అవి తీసుకుపోయి, ఎక్కడో భద్రంగా దాచి, వాటిని ఇప్పుడు ముసలివాడికి ఇచ్చేశాయి.

కోతులు వెళ్ళిపోయాక ముసలివాడు కోతిబుద్ధులను చూసి నవ్వుకున్నాడు. ఏమైనా ఆ రోజు తన అదృష్టం బాగుందనుకుని, వాడు ఆ డబ్బులన్నీ జాగ్రత్తగా

ఏరుకుని, దారిలో తనకూ తన భార్యకూ కొత్తబట్టలు కొని, ఇంటికి వెళ్ళి, మిగిలిన డబ్బు భార్యకిచ్చి, చక్కగా పిండివంట చేయించుకు తిన్నాడు.

వాళ్ళు భోజనం చేస్తుండగా పొరుగునున్న ముసలమ్మ వచ్చి, "ఏమిటి విశేషం? ఇద్దరూ కొత్తబట్టలు కట్టుకుని పండగ చేసుకుంటున్నారు!" అని ఆశ్చర్యపడుతూ అడిగింది.

ముసలివాడి భార్య, ఆ ముసలిదానికి కూడా పిండివంటలు పెట్టి, కోతుల కథ అంతా చెప్పింది.

ఆ ముసలిది అంతా విని, ఆదరాబాదరా ఇంటికి వెళ్ళి, తన మొగుడితో కోతుల సమాచారం చెప్పి, "నువు కూడా వెళ్ళి కోతులిచ్చే డబ్బులు తేరాదూ?" అన్నది సంతోషంగా.

ముసలిదాని భర్త సరే నన్నాడు.

మర్నాడు ముసలిది తన మొగుడికి అటుకులు మూటకట్టి ఇచ్చింది. వాడా మూటను తీసుకుని బీడు మీదికి వెళ్ళి, అటుకుల మూటను ఒక చెట్టుకొమ్మకు తగిలించి, బీడు మధ్య నిశ్చలంగా విగ్రహం లాగా కూర్చున్నాడు.

కొంతసేపటికి కోతులు వచ్చాయి. కొమ్మకు వేలాడుతూన్న మూట విప్పి అటుకులు తినేశాయి. విగ్రహం లాగా కూర్చుని ఉన్న ముసలిదాని మొగుణ్ణి సమీపించి ఎత్తుకుని పోసాగాయి.

ముసలిదాని మొగుడికి వాటి చేష్టలకు నవ్వొచ్చింది. వాడు పకపకా నవ్వటమే గాక కళ్ళు తెరిచి చూశాడు. అది చూసి కోతులకు పట్టరాని కోపం వచ్చింది. అవి వాణ్ణి కింద పారేసి, నెత్తిన చాలాసార్లు మొట్టి, జుట్టు బాగా పీకి, ఒళ్ళు రక్కి, గెంతుతూ వెళ్ళి పోయాయి.

చావు తప్పి కన్ను లొట్టబోయినంత పని అయి, కాళ్ళీడ్చుకుంటూ తన భర్త ఇంటికి చేరేసరికి ముసలిది తమ పాత బట్టలన్నీ తగలబెట్టేసి, తన భర్త కొత్త బట్టలు కొనుక్కొస్తాడని ఎదురు చూస్తున్నది!




## అపాయం

మామూలుగా ఇళ్ళల్లో వుండే ఈగలు ప్రపంచంలో అతి ప్రమాదకరమైన రోగాలకు కారణంగా వుంటున్నాయి. కలరా, టైఫాయిడ్, ప్లేగు వంటి భయంకరమైన ముప్పైరకాల వ్యాధులు ఈగల ద్వారానే వ్యాపిస్తున్నవి!





## 'ఒపోసం'

అమెరికన్ ఒపోసం—అడవిపిల్లి వంటి ఒక జంతువు. ఇది తరుమబడి ఇక తప్పించుకోలేని స్థితికి గురి అయినప్పుడు—కదలామెదలక పడిపోయి చనిపోయినట్టు నటిస్తుంది!

# జలుబు మిమ్మల్ని విడవకుండా పీడిస్తోందా?

మామూలు మందులు జలుబుని
కేవలం కొద్ది గంటల పాటు
నిద్రపుచ్చగలవు అంతే.
ఆయుర్వేదంలో జలుబుని
పూర్తిగా పోగొట్టే ఓ ఆయుధం ఉంది.

మామూలు మందులు జలుబుతో పోరాడవు. దానివల్ల వచ్చే ఇబ్బందుల్ని కాస్సేపు మాత్రం అణచి ఉంచుతాయి.

ఆయుర్వేద త్రిశూణ్ మీ శరీరంలో నిరోధక శక్తిని పెంపొందిస్తుంది. ఆ విధంగా జలుబుని ఎదుర్కొనేలా చేస్తుంది.

మీరు త్రిశూణ్‌ని మొదటి జలుబు లక్షణం కనపడగానే వాడారంటే జలుబుని సమర్థంగా నిరోధించవచ్చు.

---

మోతాదు: ఒక్కొక్క మాత్ర చొప్పున రోజుకి రెండుసార్లు.
జలుబు అప్పుడే ప్రారంభమవుతూంటే, త్రిశూణ్ ఒక్కరోజు తీసుకోండి. జలుబు తీవ్రంగా ఉంటే త్రిశూణ్ 2 1/2 రోజులు తీసుకోండి. టీ, కాఫీ లేదా వెచ్చటి నీటితో తీసుకోవాలి. ప్యాకెట్ మీది పూర్తి వివరాలను జాగ్రత్తగా చదవండి.

---



**Trishun** **త్రిశూణ్**

జలుబుకు తిరుగులేని జవాబు






జండూ ఫార్మసూటికల్ వర్క్స్ లిమిటెడ్.
గోఖలే రోడ్ సౌత్, దాదర్, బొంబాయి 400 025.

Trikaya.ZP.2.86 TEL A

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1988 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.



Ananta Desai



M. Natarajan

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ డిసెంబర్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి : – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: గోపన్న వుండగా మాకేమి బెంగ? రెండవ ఫోటో: చేతిలో గొడుగుంటె ఇంకేమి ఎండ?

పంపినవారు : ప్రభాకర్ మందార, ఆర్‌టిసి క్రాస్‌రోడ్స్, హైదరాబాద్—20

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి :

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


CHANDAMAMA



# విజయచిత్ర

ఇంటిల్లిపాదినీ ఆనందింపజేసే
సకుటుంబ సినీ మాసపత్రిక

## విజయచిత్ర

ఇప్పుడు మరింత ఆకర్షణీయంగా
సైజులో... గెటప్‌లో... శీర్షికలలో
కొత్తదనాన్ని సంతరించుకుని
వెలువడుతోంది!
వెంటనే ఓ కాపీ కొని చదవండి
ప్రతి ప్రతీ చదివి దాచుకుని
చదివింపజేసే పత్రిక
ఇదేనని మీరే అంటారు!!

విడిప్రతి:
రూ.4/-

సంవత్సర చందా:
రూ.48/-

వివరాలకు:
విజయా బుక్ హౌస్,
చందమామా బిల్డింగ్స్, మద్రాసు—600026